# శ్రీకృష్ణతులాభారము

(మూడంకముల నాటకము)



గ్రంథకర్త

- కీర్తిశేషులైన -

ముత్తరాజు, సుబ్బారావుగారు, యం. ఏ.,

ప్రొఫెసర్, నోబిల్ కళాశాల.



ప్రకటనకర్త:

**కురికూరు సుబ్బారావు సన్**

( స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు )

ప్రొప్రయిటరు:

**సరస్వతీ బుక్ డిపో విజయవాడ-1**

రైల్వే బుక్‌స్టాల్సు    పవరుపేట. తాడేపల్లిగూడెం.

పదమూడవ కూర్పు 2000 ప్రతులు

విక్టరీ ప్రెస్. విజయవాడ,

1958



వెల రు 1-12-0

# హెచ్చరిక

ఈ శ్రీకృష్ణతులాభారము నాటకము కాపీరైటుయొక్క సర్వహక్కులు నాకు చెందియున్నవి. కావున నా వ్రాతమూలకమైన పర్మిషన్ లేనిదే యేసంఘముగాని, యే నటీనటులుగాని ప్రదర్శింపరాదు. మరియు గ్రామఫోను రికార్డింగు ఇతర భాషలలోనికి తర్జుమాలు వగైరాలు చేయకూడదు. అట్లు అతిక్రమించినవారలు నేను జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియపర్చడమైనది.

ఇట్లు కాపీరైటు హక్కుదారుడు,

కురుకూరి సుబ్బారావుసన్,

కె. యస్. వి. సత్యనారాయణరావు

ప్రొప్రయిటరు : సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.

## నాటకపాత్రములు

**పురుషులు**

- శ్రీకృష్ణుడు-కథానాయకుడు
- నారదుడు - దేవర్షి
- ఇంద్రుడు-స్వర్లోకాధిపతి
- వసంతకుడు-శ్రీకృష్ణుని వయస్యుడు
- గర్గుడు-శ్రీకృష్ణునిపురోహితుడు
- బ్రాహ్మణులు, పౌరులు, యాదవులు

**స్త్రీలు**

- సత్యభామ-శ్రీకృష్ణుని భార్య కథానాయకి
- రుక్మిణి-శ్రీకృష్ణునిభార్య
- జాంబవతి ,,
- మిత్రవింద ,,
- శచీదేవి-ఇంద్రు నర్ధాంగి
- నళిని-సత్యభామ చెలికత్తె

శ్రీకృష్ణతులాభారము సాంగ్సు ప్రత్యేకముగా అచ్చువేయబడియున్నవి.

వెల రు 0—12—0

ప్రాప్తిస్థానము : సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.

# నవభారత్

## రచన: రాయసం

కాంగ్రెసు సిద్ధాంతాలయెడ గాఢమైన విశ్వాసంగలిగి స్వార్థ త్యాగమూర్తియైన సత్యాగ్రహికి సంఘసేవలో సంభవించు కష్టాలను సమగ్రంగా పరామర్శించిన సాంఘికనాటకం. ఆకలితో అలమటించే గర్భదరిద్రుల కడుపుకొట్టి గాదెలు నింపుకొన్న ధాన్యం మాయ బజారులో మారకంచేసుకొని కరెన్సీకట్టలకు కర్పూరహారతులిచ్చే ద్రోహుల కార్యాచరులను తూర్పారబట్టినందున జైలుకు వెళ్ళినా సత్యమేవజయతే నినాదమున ఆత్మబలికి సిద్ధమగు అహింసావాదియొక్క ఆత్మకథా నాటకము – మతోన్మాదుల మారామాయల్ని–అవకాశవాదుల ఆర్భాటాలు – ప్రేమీప్రేమికుల విహారగీతాలు – అన్నీ మూసలో కరిగించి, మనసులో మరిగించి ప్రజలకర్పైదుట ప్రత్యక్షమొనర్చిన మహోజ్వల నాటకం. వెల రు 1—8—0

## బాలరాజు

ప్రేమించి పెళ్ళిచేసుకోవాలా? పెళ్ళిచేసుకొని ప్రేమించాలా? దాంపత్యరంగంలో తరతరాలనుంచి తెగని యీసమస్యను సాకల్యంగా సమీక్షించి సిద్ధాంతీకరించిన చిత్రనాటకం,

మోహిని స్వర్లోక సౌందర్యదేవత యక్షుని ప్రేమించినఅందాల రాణి. స్వర్గంలో నాట్యం. దేవేంద్రుడు ఆమె ప్రేమకు చేయిజాచాడు. ససేమిరా అన్నదని భగ్నప్రేమికగా శపించాడు. యక్షుడు బాలరాజు గాను, మోహిని సీతగానూ భూలోకంలో అవతరించారు.

కథలో – కల్పనలో – భావంలో – భాషలో – పాటలలో – మాటలో – సాటిలేని శృంగారఘట్టాలలో కోటిస్వర్గాలను మొలి పించి మిమ్ము మురిపించి నవరసాలను కురిపించే జానపద నాటకం.

వెల రు. 1—4—0

వలయువారు :—సరస్వతీ బుక్ డిపో, విజయవాడ–1

శ్రీ ర స్తు

# శ్రీ కృ ష్ణ తు లా భా ర ము

## నాం ది

శా. తానే నాటక సర్వపాత్రధరుఁడై తానే సభాస్తారుఁడై
తానే నాటక కార్యసూత్రవహుఁడై తానే కవిశ్రేష్ఠుఁడై
తానే నాటకమై నిరంతర వినోదంబందు సాత్రాజితీ
ప్రాణేశుం డలరించుగాత మిము సంత్రాత సంధాతయై.



## స భా స దు ల కు వి జ్ఞ ప్తి

ఉ. పావనముత్తరాజులకు వార్నిధిసోముఁడు సుబ్బరావు స
త్యావిభుకృష్ణు దివ్యచరితంబును వ్రాసెను నాటకంబుగాఁ
గోవిదులార! దాని సమకూర్చి ప్రదర్శనముం బొనర్చుచో
నేపయినన్దోసంగు లుదయించిన మమ్ముఁ గృపన్ క్షమింపుడీ.



ఓమ్

# శ్రీ కృష్ణ తులాభారము

## ప్రథమాంకము

### —: ప్రథమరంగము :—

స్థలము—అమరావతీపురోప్రాంతభూమి
(నారదుఁడు హరినామస్మరణపరవశుండై నాట్య మొనర్చుచుఁ ప్రవేశించును.)

నార : (ఒడలెఱింగి) ఆహా!

మ. అదిగో నంబరచుంబి భవ్యమణిసౌధాగ్రప్రభాజాల మ
ల్లదిగో దేవనదీప్రభూతలహరీ ప్రాంచత్క్వణత్క్వాణ మ
ల్లదిగో నందనజాత పాదపలతాంతామోదసంభార మ
ల్లదిగో నింద్రపురంబు వెల్గెడు నమందానందనిష్యందియై.

ఎంత త్వరితముగా నరుదెంచితిని. కార్యాంతర్నిమగ్నులకుఁ గాలము పోకడ తెలియదుగదా? ఇంతవరకు హరినామస్మరణావేశంబున సొక్కుచు సోలుచు నొడలెఱుంగక కర్తవ్యమును స్మరింపక సంచరించుచుంటిని. ఇంకఁ ద్వరలో నింద్రు దర్శింప నున్నవాఁడ. ఆతఁడు పారిజాతహరణంబునవలనఁ దన భార్యకుఁ గలిగిన పరాభవంబున రాజ్యకార్యవిముఖుఁడై యున్నాఁడని వింటిని, ఇయ్యెడ నున్నఁగాంచి యతఁడేమనునో?

ఉ. అంబుజనాభునిం గనెడు వ్యాజమునం జని పారిజాత పు
ష్పంబొకఁడిచ్చి యాతని సభార్యముగాఁ దన పారిజాత వృ
క్షంబును సంగ్రహింపఁ దమకంబునఁ బంపితి నంచు నన్వీరో
ధింబలె నాసురేశ్వరుఁడు దెప్పునో? లేక బహూకరించునో?

నాకిట్టి సందియ మేల? అతండు నను(ఁబోలు దేవర్షుల దిరస్కరింపఁబూనునా? జగన్నాటక సూత్రధారుండగు వాసుదేవుని మాయ లెఱుంగకుండునా? కావున నాకీ విషయంబున సంశయ మనవసరము

కాని నాఁటి పారిజాతపుష్పవృత్తాంతంబు దలపోయ సిగ్గువాడము చున్నది. నేనొకటిఁ దలచిన దైవము వేఱొకటిఁ దలచుటఁ జేసి యా కార్యము తాఱుమాఱయ్యె.

సీ. సరసాత్రభామాత్రవిస్ఫూర్తి కాత్మ్యమై యిం
ద్రోపేంద్రులకు వైర ముప్పతిల్లెఁ
బారిజాతలతాంత పరిమళమ్మునఁ జొక్కి
యింద్రాణి కయ్యది మృగ్యమయ్యె
నపరరమా దేవి యైన వైదర్భికిఁ
బలుగురలోఁ దలవంపులయ్యె
నాత్మేశ్వరానురాగాంధకు సత్య క
పజయంబునకు మాఱు విజయమయ్యె

తే. గీ. గలహ మొనగూర్ప నాఁకలి తొలఁగెఁ గాని
సాటివారలలో మొగమాట మయ్యె
నకట ! కలహప్రియత్వమా ! వికటలీల
నెట్టి చిట్టల సంఘటియించినావు !

(యోజించి) కానిమ్ము. ఇంతమాత్రమున నారంభించిన కార్యము బరిత్యజింతునా ? నా కలహప్రణయము సర్వలోకోపకారి గాన మఱలఁ బ్రయత్న మొనర్చెద. శచీదేవిని సంతసింపజేయు నెపమ్మున శ్రీకృష్ణుండు భార్యావిధేయుడుగాక భక్తవిధేయుఁడని నిరూపించెద. సత్యభామ కీ ముపచేఁ బ్రేమకును భక్తిని గల తారతమ్యము జూపి భక్తురాలిం జేసెద. ఇందులకు సర్వ సత్కార్యసహాయుం డగు శ్రీమన్నారాయణుండు తోడ్పడుగాత !

(నిష్క్రమించును.)

## —: ద్వి తీ య రం గ ము :—

స్థలము : అమరావతీ నగరము - శచీదేవి శుద్ధాంతము.

(శచీదేవి నిరలంకృతయై మలినవస్త్రయై నేలఁ గూర్చుండియుండ, నింద్రుఁడు కొన్ని కుసుమంబులఁ జేతంగొని చెంత నొక యాసనమునఁ గూర్చుండి యుండును.)

శచి : నాథా ! నాదుఃఖంబు కడుంగడు దుర్భరం బగుచున్నది.

ఇంద్ర : దేవీ! సమాశ్వసిల్లుము. సమాశ్వసిల్లుము.

శచి : నాథా! చేయుట చెప్పుటయంత సులభమైనతో మీ యాన నే నెరవేర్ప వెనుదీయుదునా ?

ఇంద్ర : ప్రేయసీ! అట్లనిన నెట్లు ? ఎంతకాలమిట్లు దుఃఖారణ్యమున నిల్లుఁగట్టుకొని కాపుర మొనర్చెదవు ? నీకంటనీరు నాకాలి బంధమై నన్ను గార్యవిముఖుని జేయుచున్నది. లెమ్ము సర్వ దుఃఖ తిమిరఘ్నం బగు నీ మందహాసచంద్రికను జూపుము. నేనీదినమేని కొలువుకూటమున కేగెద.

శచి : నాథా! నేనేమి మిమ్ము బోవలదనిపట్టుకొంటినా? యథేచ్ఛము గాబోయి రండు. నాయవస్థకు మీరు దుఃఖింపనేల ? కార్య విముఖులు గానేల?

ఇంద్ర : ప్రేయసీ! నీవిట్లాడదగునా ? నాకునీపైఁగల ప్రణయప్రభావ మెఱుంగవా? పరిభవఝంఝానిలాఘూంతంబుల బ్రభ్రశ్యమాన జీవ ప్రసూన వగు నిన్ను విడిపోవ నాకుఁగాళ్ళాడునా? ఇవి గో మందార కుసుమంబులు. ఇవిగో హరిచందనపుష్పంబులు ఇవిగో సంతానలతాంతమ్ములు. వీనిని ధరించి నీ దుఃఖమును దొఱంగుము. ఒక్క పారిజాతవృక్షంబు పోయిన నింక దానికి సదృశంబగునట్టివి నాలుగు మన నందవనమున లేవా? దానికై యింతదుఃఖ మేల?

శచి : ప్రాణేశా ! ఎన్నిపర్యాయములు నేను నుడువవలయును? పారి జాత నష్టంబున కేను దుఃఖింపను. నాకయ్యెడ సంభవించిన పరాభవంబునకు దురపిల్లెద దేనినైన నోర్వవచ్చుఁగాని పరా భవ మోర్చుట కష్టముగదా!

ఇంద్ర : దేవీ! ఇంకను నీవు దానిని మఱువలేదా ? కడచినదానికి వగ చుట నినుబోలు శేముషీవతుల లక్షణము గాదుసుమా !

శచి : అవును చేయలేని వారందరు నిట్లే చెప్పుదురు.

ఉ. అమ్మొయి మిమ్ముఁగెల్చి యనురాగముఁ గైకొనినట్టి కృష్ణు మీ తమ్ముఁడు, దేవదేవుఁడు, స్వదారపక్షపాతుఁడని నైతుఁగాక, రో

షమ్మాత్ తోడికోడ లగు సత్య యొనర్చిన యప్పరాభవం
బెమ్మెయి సైఁచుదాన హృదయేశ్వర! యింతయెఱుంగనేరరే?

ఇంద్ర : (స్వగ) తోడికోడండ్ర తగవు లన్నదమ్ములసంఖ్యంబునకు వేరు పురుగులుగదా! (ప్రకా) దేవీ! కొంచెము వేఁచియుండుము. కాలక్రమంబున నంతయు జక్కఁబడును. ఇట్టి దుఃఖముల మాన్పఁ గాలభిష్వరుఁడే సమర్థుఁడు.

శచి : నాథా! ఏమి మీయౌదార్యమాటలు, వీనిచే (అర్థోక్తిలో)

ఇంద్ర : దేవీ! గురువయ్య డిట్లు వచ్చుచున్నాఁడు.

(బృహస్పతి ప్రవేశింప శచీంద్రులు నమస్కరింతురు.)

బృహ : ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు. (ఇంద్రుఁ డాసన మొండు చూప నాసీనుడై) దేవేంద్రా! ఈ దినముగూడఁ గొలువుకూటమునకు రావైతివి సురరాజ విట్లు రాజధర్మంబుల నిర్వర్తింపకుండుట న్యాయమా!

ఇంద్ర : గురూత్తమా! ఏమిచేయు మనియెదరు? నారదముని మూలం బున నిట్టి యిక్కట్టుల పాలైతిని. అతనిఁ బారిజాతసుమంబును ద్వారకకు గొంపోవనీయకున్న నిట్టిచిట్టలు పుట్టియుండవు.

క. కలహప్రియుఁ డని తెలిసియు
జలజాసనసూతి కేను చన విచ్చుటచేఁ
బలవింపవలసి వచ్చెను
కలహప్రియు లాప్తదుఃఖకారకులు గదా!

బృహ : సురేశా? నీవు సామాన్యులబోలె నిట్లాడదగునా? నారదుని సురరక్షణాసక్తింగాని, శ్రీకృష్ణుని మహాత్మ్యముంగాని నీవు మఱచితివా?

ఉ. హాటక గర్భసూతికలహప్రణయుమ్మె మమ్ముం గలంచె నం
చేటికి సర్వముం దెలిసి యిట్లు వచించెదవయ్య! శ్రీజగ
న్నాటక సూత్రధారు డగు నందకుమారుని యాన లేక య
ప్పాటునఁ జీమయైనఁ గఱవంగలదయ్య? సుపర్వనాయకా! 6

ఇంద్రు : అగుగాక! అయిన నారదుఁడీ విషయమున నిర్దోషియగునా!

శచి : గురువర్యా! నారదుడు నిర్దోషియైనను నందకుమారుడు మమ్మిట్లు బాధింపనేల?

బృహ: ఇంద్రాణీ! ఆ మహామహునిచర్య నెవ్వరికిని వేద్యంబులగునా? ఆవిషయ మెట్లున్నను నతడు భక్తవత్సలుండుగాన మనబోటి భక్తుల భక్తికి సంతసింపకపోడు.

శచి : గురువర్యా! అతడు భక్తవత్సలుడో, భార్యావత్సలుడో మున్నే తెలియలేదా! మీరు నిజము గప్పిపుచ్చిన నాకు గన్నులు లేవా? వారికి లోంగసిధర్మ మెందైన నుండునా?

బృహ : దేవీ! నీ ముఖావేశము నిన్ని ట్లాడించుచున్నది. లేనియెడ నీకు నామాటల యథార్థము తెలియకుండునా?

[నారద వీణానాదము వినబడ]

ఇంద్ర : గురూత్తమా! ఆ వీణానాదము నాలకింపుడు; నారదుడు వచ్చుచున్నట్లున్నది.

బృహా : (విని) అవును! ఆ వచ్చునది, నారదుడే.

శచి : గురువర్యా! అతఁడు మఱల నేమి తెచ్చిపెట్టునోకదా!

బృహా : భయపడకుడు, సురేశా! ఎదురేగి యర్ఘ్యపాద్యాదు లొసంగుము.

(నారదుడు ప్రవేశింప నింద్రు డర్ఘ్యపాద్యాదు లొసంగి నమస్కరింప హస్తమెత్తి)

నారద : సీ. స్వస్త్యస్తు సర్వ గీర్వాణ క్షమాభార
భరణ క్షమానిత భుజావరణ! నీకు
శ్రీరస్తు శరణాగతా రాతి సంఘాత
సంపాలన వ్రతాచరణ! నీకు
విజయోస్తు పృథులదోర్వీర్య గర్వోపేత
దైత్యవిధ్వంసనా చరణ! నీకు
మహనీయతాస్తు భామామణీమానస
హారణైక చారుతాభరణ! నీకు

తే. గీ. వివిధవిభవోస్తు సర్వదిగ్విజయ! నీకు
సర్వశుభమస్తు శాశ్వతైశ్వర్య! నీకు
సతతహర్షోస్తు లోకప్రశంస్త! నీకు
బహుళభోగోస్తు స్వర్లోకపాల! నీకు

ఇంద్ర : మునీంద్రా! మీ యాశీర్వచనము ఫలించుగాక! ఈ యాసన మలంకరింపుడు.

నార : (ఆసీనుడైనంత శచీదేవి నమస్కరింప "కల్యాణమస్తు" అని దీవించి) దేవేంద్రా! నేఁ డేల యీ సమయమున మీ సభా భవనము మూయబడియున్నది? మఱియు మీ దంపతుల ముఖంబున విన్నఁదనంబు దోఁచుచున్నది. దీనికి గారణము దెలుపదగిన వినగోరెద.

ఇంద్ర : నారదా! ఇందులకు గారణము నీ వెఱుంగనిదియా? ఇదం తయు నీ నిర్హేతుక జాయమాన కృపాకటాక్షఫలమే సుమా!

శచి : మునీంద్రా! ఇందులకు గారణము మీ మనస్సు మీకు దెలుపు చుండుటలేదా? కన్ను బొడిచి కన్నీటికి గారణమేమని యడిగిన మే మేమని చెప్పగలము?

నార : ఏమేమీ? మీ దుఃఖమునకు నేనా కారణభూతుడను?

ఇంద్ర : నారదా! మా గ్రహచారవశంబున కాబోలు సురోపకారి వవు సురాపకారి వైతివి.

సీ. కనకపు నహంకారంబు మాయింపఁ
బురుషోత్తముని వేడఁబోవునాడు
బలిదాన వౌద్ధత్యపరిహార మొనరింప
నబ్జనేత్రుని కడ కరుగునాఁడు
కంసనృశంసు విధ్వంసంబు గావింప
మా మనోహరు బ్రతిమాలునాడు
తారకదైత్య సంహారంబుఁ జేయంగ
శంకరు బ్రార్థన సలుపునాఁడు

తే. గీ. తోడునీడఁగ వెలఁగి మాదుఃఖ మార్చి
నట్టి యుపకారి నీయెడ నహితుఁబోలెఁ
కృష్ణు మాపైకిఁ బురిగొల్పి యిట్లు మమ్ముఁ
గష్టములపాలు సేయు టే కార్యమయ్య ?

శచి : సురజ్యేష్ఠమానుండవై సురేంద్రునకును సురజనశరణ్యుం డగు నుపేంద్రునకును సంతఃకలహములఁ గల్పించి వేడుకఁజూచుట మీకుఁ బాడియా?

నార : శచీంద్రులారా ! నేనేమి, మీకుంగాని సురలకుంగాని యప కార మొనర్చు టేమి? నాకలహప్రియతకు మును సతతంబు మీ కుపకార మొనర్చుటకే కదా వినియోగించుచుందును.

ఇంద్రు : నారదా ! నీ మొన్నటిచర్యయు మా కుపకార మొనర్చు నందువా యేమి?

నార : నిస్సంశయముగా దైవవిధులు సర్వదా శుభంకరములు. అల్ప జ్ఞుల మగు మనకవి ప్రస్తుత మపకారములుగా దోచినను బర్యవసానంబున నయ్యవి యుపకారంబు లని రూఢియగు. ఏమయినను నిందు నాదోష మేమున్నది ?

ఉ. కారణకారణుం డగుచుఁ గర్మసధిన్ సతతంబు లోకసం
వారము నేలుచుండు సిరివల్లభుఁ డొక్కఁడెకాన నన్నుబోల్
కారణమాత్రు లెట్టు లపకార మొనర్పఁగలార లంచు బృం
దారకనాథ ! సుంతయయిన న్మది నెంచక వల్కఁజెల్లునే ?

బృహ : నారదా! వీరి కా విషయమును గురించి చెప్పుచుంటిని. వీరి దుఃఖ మిట్లు వీరి మాటాడ ప్రేరించినది పోనిమ్ము.

నార : గురుశేఖరా ! దుఃఖార్తులైనంత, ధర్మాధర్మ విచక్షణత వదల వచ్చునా ? సురేంద్రా నీ కెందుల కీ దుఃఖము ? సర్వచరాచర సృష్టిస్థితి లయకారకుండగు చక్రపాణి గెలువనైతి ననియా? లేక సర్వేశ్వరునకుఁ బారిజాతవిటపంబును గోల్పోయితిననియా ?

ఇంద్ర : కాదు కాదు అందులకు నేఁ జింతింప. నా కొఱకుఁగూడ నేఁ జింతింప.

ఉ. నందకుమారు సంగరమునం గెలువంగను లేదటంచు నే
వందురఁ బారిజాతవిటపంబును గోల్పడినాఁడనంచుఁ జిం
తం దపియింప, గాని నిరతంబు శచీరమణీమనోవ్యథా!
గ్ని దిలకింపనోపక సుంత్వము వీడెద నయ్యనారదా! 10

నార : ఓహో! ఇదియా నీ దుఃఖమునకుఁ గారణము అర్ధాంగివంత పతిపంచుకొనుట సహజమేకదా! ఇంద్రాణీ! నీదుఃఖము బోవు మార్గమెయ్యది? తెలియఁ జేయుము. నేఁటినుండియు నిర్నిద్రుండనై దాని సాఫల్యమునకై పాటుపడియెద.

శచి : (స్వగ) అక్కటా! ఇంతకుముం దొనర్చినది చాలక కాఁబోలు మఱల యత్నించెద ననుచున్నాఁడీ నారదుడు! ఇతడు మఱల గృష్ణుని మాపైకి దెచ్చునేమోకదా! ఏమి సేయుదును?

నార : ఇంద్రాణీ! ఏమూరకున్నావు? ననుబోలు నసమర్థులఁ గార్యాచరణమునకు నియోగించుట యాత్మోపద్రవహేతువగుననియా! భయపడకుము ఈ పర్యాయము నాకు జయము తప్పదు.

బృహ : శచీదేవీ! తెలుపుము నారదు డఘటనఘటనాసమర్థుఁడు!

ఇంద్ర : దేవీ! నన్నుఁ దెలియజేయు మనెదవా?

శచి : మునీంద్రా! మీరు దానినెరుంగరా? ఐన నడిగితిరిగాన దెల్పెద.

మ. అలనాఁ డాత్మమనోహర ప్రణయగర్వాంధీకృతస్వాంతయై
తలవంపుల్ కడు నాకుఁ గూరిచిన సత్యాదేవి భంగంబు వీ
నులు చల్లబడ విన్నదాక, వనమందుం బారిజాతంబు గ
న్నులు చల్లంబడఁ గన్నదాక నెటు సంతోషింతునో నారదా!

నార : శచీదేవి! నీకు హర్షప్రదంబగు మార్గంబు దెలిసికొంటి, ఇంక దత్సఫలతకై యుపక్రమించెద.

బృహ : నారదా నీకీ కార్యాచరణంబున దైవము తోడగు గాక!

నార : గురూత్తమా! నాకీవిషయంబునఁ దప్పక వాసుదేవుఁడు సాయపడునని తోచుచున్నది. ఏలయన.

ఉ. అక్కమలాక్షుఁ డాత్మతరలాక్షులఁ దక్కనవారికంటెఁ ద
న్నెక్కుడు ప్రేమఁజూచు నని యెల్లరముందఱ మత్తయై
నిక్కుచునుండు సత్య కిఁక నిర్జరబోధక ! గర్వభంగమే
నిక్కువ మిచ్చు నమ్మ మిలనిక్కడువారలు పొక్కుదురే !

బృహ : తథాస్తు.

ఇంద్ర : నారదా! ఈకార్యంబుఁ జక్కపెట్టి మాయాజమాన్యాంతకృత
జ్ఞత కాస్పదంబ వగుము.

శచి : దేవర్షి చంద్రా ! ఈకార్యంబు సఫలమొనర్చి పారిజాతాపహ
రణంబునఁ గళంకితంబగు నామనంబును, శ్రీకృష్ణ భక్తివాత్స
ల్యంబును విశదీకరింపుము.

నార : దేవీ ! అట్లే యొనర్చెద నమ్మమ్మ పాకశాసనా ! ఇంక నాకు
సెలవా ?

ఇంద్ర : నారదా ! పోయిరమ్ము నీ యుద్యమమును మేమిచ్చనుండి
వీక్షించుచు జయప్రదంబైనంత మా యానందము నుచితరీతి
బ్రకటించెదము.

నార : అట్లే యొనర్పుము. శచీదేవీ ! సురగురూ ! నేఁ బోయివచ్చెద
(నారదుఁడు నిష్క్రమింప)

బృహ : దేవీ ! ఇఁక నీ దుఃఖము మానుము. నీ మనోరథంబులీడేరు.

శచి : (నవ్వుచు) గురువల్లజా ! మీ యాశీర్వచన ప్రభావంబున నట్లే
యగుగాక !

ఇంద్ర : దేవీ ! ఎన్నాళ్ళకు సెలవుగా నీ మందహాస చంద్రిక మఱలఁ
గాంచు భాగ్యమబ్బెను. ఇక నీ వంత యంతమొందెఁగాదా ?
నే నింక నేఁడు సభాభవనమున కేఁగవచ్చునా !

శచి : నాథా ! పోయి శీఘ్రముగ రండు.

ఇంద్రు : గురుచంద్రా! రండు సభాభవనమున కేగుదము.
(ఇంద్ర బృహస్పతులు నిష్క్రమింప యవనిక పడును.)

ఓం

# శ్రీకృష్ణతులాభారము

## ద్వితీయాంకము

### —: ప్రథమరంగము :—

[స్థలము : ద్వారకా పురోప్రాంత భూమి]

[నారదుఁడు గాన మొనర్చుచుఁ బ్రవేశించును.]

ఈ పారిజాత లతాంతామోదము నే ద్వారకఁ జేరితినని తెల్పకయే తెల్పుచున్నది. (దృష్టి సారించి) అదిగో సాత్రాజితీ ప్రమదావనము. అందు శ్రీకృష్ణుం డెప్పటివలె సత్యాదేవింగూడి విహార మొనర్చుచుండును. సత్వర మేఁగి వారిని దర్శించి కార్యసాఫల్యంబున కంకురార్పణ మొనర్చెద (కొంతనడిచి) శ్రీకృష్ణుని డాయుకొలది కార్య మెట్లు పరిణమించునో యని నామనంబు తహతహ పడుచున్నది. ఆ సత్యభామావిధేయుండు నా సత్యభామా గర్వాపహరణోద్యమంబునకు సహకారియగునా ? (యోచించి) ఇటునాబోంట్లకు శంకింప నగునా ? ఆ భక్తవత్సలుండు భక్తుల సన్మనోరథంబు లీడేర్చకుండునా ? ఆర్య గర్వాపహారణుండు సత్యాదేవి గర్వమడంపకుండునా? కావున నిర్భయముగా నేగి పూర్వమాలోచించిన విధంబున నాచరించెద. (కొంతనడిచి) సత్యాదేవి ప్రాణేశ్వరు సంపూర్ణానురాగంబు తనయెడల గలదని చీటి మాటికిఁ దన సపత్నులలోఁ దగవులాడుచుండు. ఈ దిన మట్టి కలహ మొకటి సమకూరెనా సరియే లేనిచో నేనే యేదోవిధమున నొక్కటి గల్పించెద. కలహకల్పనము నాకు వెన్నతోఁబెట్టిన విద్యగదా ! తర్వాత సత్యాదేవికిఁ బుణ్యకవ్రత ముపదేశించి పారిజాతావృక్షంబును, వాసుదేవుని దానంబుగాఁ బరిగ్రహించి సత్యభామను రుక్మిణింబోలె భక్తురాలిఁగా నొనర్చెద. శచీదేవికానందంబుఁ జేకూర్చెద. నామనోభీష్టంబు నెరవేర్చుకొనియెద. దేవా ! నందనందనాఁ నిన్ను నమ్మినవారి కేమి కొఱఁత ?

సీ. దుర్వాసు నస్త్రంబుఁ గ్రమ్మంపగా నిను వేడు
నంబరీషున కెట్టి యార్తి గలిగె?
జనకుబాధలనుండి మనుపఁగా నిన్నుఁ గొల్చు
ప్రహ్లాదునకు నెట్టి బాధగలిగె?
దుశ్శాసనుని బారిఁ దొలగింప నిన్నన్న
ద్రుపదపుత్రిక కెట్టి దొసఁగు గలిగెఁ
మొసలిమోమునుండి ప్రోవఁగా నిన్నెంచు
నిభరాజునకు నెట్టి యెగ్గు గలిగె?

తే. గీ. వారు పీరనసేల నీ భక్తతతికి
నార్తరక్షణ! నీ వుండఁ నార్తి గలదె?
శిష్టపోషణ! నీ వుండ జింతగలదె?
భక్తవత్సల! నీ వుండ భయము గలదె?

(నిష్క్రమించును)

## సతీ సక్కుబాయి

గ్రంథకర్త : సోమరాజు రామానుజరావుగారు

సక్కుబాయి పతివ్రతామతల్లి. భగవంతునిచేత అత్త గారికి సేవచేయించిన గారడికత్తె. శ్రీకృష్ణుని సవతిగా జేసికొనిన నెరజాణ. పాండురంగని భార్యగా చేసి, తనమగని సౌఖ్య మొసం గిన మంత్రవాదిని, భక్తిరసాయనము లోకములో వెదజల్లి జనుల యజ్ఞానరోగమును రూపుమాపిన వైద్యురాలు. అమా యకుడగు తన భర్తను సకలవిధముల సేవించిన పుణ్యాత్ము రాలు. యమదూతవంటి యత్తగారిచేత కోరంటకమువడి యామెను పాండురంగని భక్తురాలిగా జేసిన తపస్విని. ఆంధ్ర దేశమంతటను ప్రదర్శింపఁబడి కీర్తిగాంచిన నాటకము.

వెల రు 1—12—0

## ద్వి తీ య ర ం గ ము

స్థలము— ద్వారకాపురప్రాంతోద్యాన వనము

సత్యభామాకృష్ణు లుద్యానవనవిహార మొనర్చుచుందురు.
నళినియు వసంతకుడును జెటియొకప్రక్క నిలిచియుందురు.

కృ : సత్యా ! ఈ యుద్యానవనలక్ష్మి శృంగార మెందులకో నీకు దెలియునా ?

తే. గీ. ప్రాదళంబను మలినాంబరంబు వదలి
తలిరుటాకుల చెంగావి వలువ గట్టి
కుసుమములఁ దాల్చి మాధవుకూర్మిఁ గోరు
నుపవనేందిర నిక్కంబ యుత్పలాక్షి !

సత్య : ప్రాణప్రియా ! ఇది స్త్రీజనసహజవ్యాపారముకదా ! మనోహరులప్రేమ గడించుటకు మాకందరకు శృంగారమే కదా మూలధనము !

కృ : ప్రేయసీ ! అవును. ప్రేమ సురాపాన మెట్టివారలనైన నిట్టియాట లాడింపకుండునా ?

సత్య : మనోవల్లభా! ఆప్రేమయే లేకున్న నీ లోకమే పాడుగదా ! నీ ప్రణయమేకదా నాకీలోకమును వాసయోగ్యముగా నొనర్చుచున్నది. ఈ ప్రణయము మహిమ నిర్వర్ణనీయము.

తే. గీ. సారసంసారభవన సంస్థాపనంబు
మానసికదుఃఖముల మాన్పు మచ్చుమందు
కొలువఁగారాని తఱుఁగని వెలకురాని
ప్రేమతోఁడుత సరిసాటి యేమిగలదు !

కృ : (స్వగ) భక్తియని నీ కెఱుకపడని చోందు గలదు నారదుఁడు నీకు శీఘ్రముగా దాని నెఱిగించును లెమ్ము.

సత్య : నాథా! ఏల ప్రత్యుత్తర మీయకున్నారు ? హృదయేశ్వరు ప్రేమార్ణోరాశిందలంబునుకు లంపుచుండు నీరజనేత్రలకు వాంఛ నీయందు కలదనియా ? అట్లయిన మీప్రేమ నా ప్రేమ వలె సమగ్రమైనదికాదు. అక్కటా! ఇది నిజమేనా ?

కృ : ప్రేయసీ! నిన్నందరికంటె నెక్కుడుగా ప్రేమింతు ననుట కీ పారిజాతవృక్షము సాక్ష్యముగాదా? ఇంకను నిట్టివనేకములు నాకు నీయెడఁగల నిస్తుల ప్రేమంబును సూచించుచుండ లేదా? ఎన్నిసారు లీ విషయముఁ గూర్చి నుడువవలయును ?

సత్య : నాథా ! ఇట్టివార్త లెన్నిపర్యాయములు విన్నను వీనులకు వెగటగునా ? చూడుడు. మీరు నాపై ప్రేమగలిగి యున్నంత వరకు లోకమంతయు నాకుఁ ప్రేమమయముగా నున్నది. ఈ ప్రేమప్రధానం బనివార్యంబు, దీనికిలోంగనిదెందును గన్పట్టదు.

సీ. భ్రమరంబు భ్రమరికి సుమరసంబును జూపి
త్రాగించి శేషంబు త్రాఁగుచుండు
మృగము మృగినిఁ జేరి శృంగంబుతో గీరి
స్పర్శనసుఖముఁ గన్పఱచుచుండు
కరినోటఁ గరిణి పంకజ రేణుగంధిల
నీరంబుఁ గరముతో నించుచుండు
హంసంబు హంసకి నర్ధభుక్తము లగు
బిసకాండములఁ దిన నొసగుచుండు

తే. గీ. శుకము శుకకాంత కాత్మచంచువునఁ దెచ్చి
మావిఫలముల మెసవంగ మరపుచుండు
నౌర! ప్రేమమాహాత్మ్య మేమనగవచ్చుఁ
జేతనావళి నెల్ల వశీకరించె.

కృ : బేలా! ఇదంతయు వసంతర్తు లక్షణంబు గాదా ?

సత్య : నాథా ! దేని లక్షణమైనను నా కెంతయు దర్శనీయంబుగా నున్నది. వీనికన్నిటి కిట్టియనురాగమును గఱపిన మహానుభావుఁ డెవఁడో ?

కృ : సీ. వల్లరులకు విటప ప్రసారంబు బో
ధన మొనర్చిన యుపాధ్యాయుఁ డెవండో ?
కాంతల కనురూపకాంతులఁ గన మోహ
ముపదేశ మొసఁగిన యొజ్జఁయెవడో ?
చంద్రకాంతములకు జంద్రదర్శనమున
హాసింపఁ గఱపిన గురుఁ డెవండో ?
కంజంబులకు భానుకరపరామర్శ బో
ధంబు సేరపిన బోధకు డెవండో ?

తే. గీ. యాసమస్త చరాచరాధ్యాపకుండె
నీవు చూపిన కాముకీనిచయములకుఁ
గూడ వలపును గఱపినవాఁ డఁటంచుఁ
దెలియఁగా నేర వైతివే? జలజనయన?

సత్య : ప్రాణేశా! తెలియక కాదు. మీ నోటినుండి వినఁ గుతూహల పడి యట్లడిగితిని. అదిగో! ఆబాల కురంగమును జూడుఁడు ? ఆటలచే డస్సిపాదపచ్ఛాయ విశ్రాంతిఁ జెందుంచు నొకకురంగిఁ గాంచి దానితోఁ జెలలాటంబునకుఁ జొచ్చినది. ఎంత తెలివి లేనిది?

కృ : ప్రేయసీ! దీని కచ్చెరు వంద నేల?

అ. వె. ఏణివెంట నంటు నేణంబు మాఘ్యంబు
దూఱ నేల? యెట్టి ధీరునకును
వెలఁది వేఁగుచుక్కఁ దిలకించినంత నే
తెలివి తెల్లవాఱు దే! లతాంగి!

మఱియు దీనికి దృష్టాంతముగా—(అర్ధోక్తిలో)

(వసంతకుఁడు నళినిని దనతోడ వనవిహార మొనర్ప రమ్మని సైఁగజేసి తిరస్కృతిఁ గాంచి యొడ యెక్కుటయు నాఁకలి యెత్తుటయు చూచించు వికృతాభినయ మొనర్చి కృష్ణుని దగ్గఱ)

వసం : వయస్యా! వయస్యా నీవీభామతోడి సరసల్లాపముల నాట

పాటల నామాటయే మఱచిలట్లున్నది. కడుపు మలమల మాడుచున్నది. ఇఁక మజ్జనభోజనాదు లొనర్తుము రమ్ము.

కృ : వయస్యా! నీ కప్పుడే యాఁకలి యెత్తుచున్నదా?

వసం : ఆటలాడువారి కాఁకలి తెలియునా? ఎంత ప్రొద్దెక్కినదో చూడుము.

కృ : (చూచి) అవును. రాగిగా నుండిన లోకబాంధవుఁడుగూడ విరాగియయ్యె ప్రేయసీ! ఇంక నీమందిరమున కేగుదుమా? నావయస్యు డాఁకలి కోర్వలే కున్నాఁడట!

సత్య : మీ వయస్యున కాఁకలి యెత్తని క్షణ ముండునా? అయిన మీ కిష్టమైన నంతఃపురము కేగుదము రండి.

(సత్యాకృష్ణులు ముందును నలినీవసంతులు వెనుకను నడచుచుండ జాంబవతీ మిత్రవిందా సమేతయై రుక్మిణి ప్రవేశించును. అందరును శ్రీకృష్ణునకు మోఁకరించి నమస్కరింప)

కృ : కళ్యాణమస్తు. భీమరాజపుత్రి! ఏటి కిట్లు సపత్నులతోడ విచ్చేసితివి?

రుక్మి : (చెలికత్తెలతో లేచి) నాథా! కార్యార్థినినై వచ్చితిని. నా దొక మనవి కలదు. చిత్తగింపవలయు.

కృ : వైదర్భీ! తెలియఁజేయుము అట్లే కావించెద.
(సత్య కోపఘూర్ణితనేత్రయై వెనుకకుఁ దిరిగి నిలుచును నారదుఁడు మెల్లగా ప్రవేశించి యొక పార్శ్వమున నిలిచి)

నార : మంచి సమయముననే వచ్చితిని. ఈ సత్యభామా ముఖమున గల అంధకారోదయమ్మునకు మున్ముందు దోఁచు సంజ కెంజాయ గన్పట్టుచున్నది. ఎందులకో ఇందుండి వినియెదఁగాక!

రుక్మి : ఉ. నందకుమార! పుట్టినదినం బని నేఁడ తివైభవంబుగా!"
బంధుగుల సపత్నులను బ్రాహ్మణులం బిలిపించి విందొన

ర్వం దలగొంటి, నా కిహపరంబుల దిక్కగుమీరు సత్యతో
నందుల కేఁగుదెంచి ముదమందఁగఁజేసి యను గ్రహింపుడీ.

వసం : భక్త! నా కీ దినమున రెండుచోట్ల పప్పుపప్పళములు. ఎచ్చటి కని పోవుదును?

కృ : (నవ్వుచు) సత్యా! మీయక్క ప్రార్థనను వింటివిగదా! అట్లొనర్తుమా?

సత్య : నాథా! నేఁడు మీ పట్టమహిషికిఁ బుట్టినదినమైన నాకు మెట్టినదినము అందులకై విందొనర్ప సర్వప్రయత్నము లొనర్చియున్నదాన. నళినీ! ఈదినమున గోవిందునకు విందొనర్ప నే నాజ్ఞ యిడలేదా!

నళి : అవునమ్మా! ఈ దినము మీ యత్తవారింటికి వచ్చిన శుభ దినము గదా?

నార : (స్వగ) ఆహా! సత్యాదేవికిఁ దగిన దాసియే లభించినది.

మిత్ర : సత్యాదేవీ! ఇంతకు మున్నెప్పుడు నీ వీదినము మెట్టిన దినమని చెప్పక యుంటివేమి?

సత్య : నే నెప్పుడు చెప్పిన నన్నడుగువారెవరు ?

రుక్మి : సోదరీ! మెట్టినదినమున విందొనర్చువారు గలరా?

సత్య : ఆహా! జరిగిన నన్నిదినములు విందొనర్పగూడదా?

జాంబ: సాత్రాజితీదేవీ! అట్లని వెన్నెలగొడుగుఁ బట్టువారుందురా?

కృ : (జాంబవతిని వారించి) సత్యా! అయిన నీ యిష్టమేమి?

సత్య : నా యభీష్టమేమని వేఁడగా నన్నడుగవలయునా? క్షణము క్రింద మీరు నామందిరమునకు వచ్చెదమని బయలుదేఱ లేదా? సరే! కానిండు. మీ రెవ్వరిగృహమేఁగి విందారగింప నిష్టమో మీరే నిర్ణయించుకొనుఁడు. నన్నడుగనేల?

కృ : (స్వగ) సత్య కప్పుడే కోపమువచ్చె కానిమ్మిది యెంతయు నారదకార్యమున కనుకూల మగుఁగదా?

మ. అరవిందేక్షణ సత్యభామ పటు మోహాంధీకృతస్వాంతయై
మరలన్ రుక్మిణితోడి పంతమునకై మర్యాద పోనాడి ని
ష్ఠుర వాక్యంబుల నాడఁ జొచ్చి నికఁ నీజోక్యం బరా కూన కీ
తరుణంబం దెటేఁగింతు మస్మహిత భక్తత్రాణ పారీణతన్.

ముందీవిధమున నుడివెదఁగాక! (ప్రకా) వైదర్భీ! వింటివిగదా నీచెలియలి ప్రత్యుత్తరము! ఇంక నన్నేమి సేయుమనియెదవు?

రుక్మి : దేవా! నేను మీకుఁ గర్తవ్యము బోధించునంత దాననా?

మ. జలజాతేక్షణ సర్వకాముదునిగా సర్వజ్ఞుగా వి
జ్ఞ లసంఖ్యేయులు సర్వకాలముల నుద్ఘోషించునో, మీకు నేఁ
దెలుపంజాలుదునయ్య కార్యమును ధాత్రిన్ నన్నుఁబోల్గు ర్తిడీనా
రలకౌనా కనులిచ్చువారలకు మార్గంబుం బ్రదర్శింపఁగన్. 9

జాంబ : నాథా! మీరు రుక్మిణీదేవి ప్రార్థన వినకమున్న దాని నొడ
గూర్తు మనలేదా?

కృ : వైదర్భి! సత్య యిష్టపడిన నాయాటంకం బేమియులేదు. సత్యనడుగుము.

నార : (స్వగ) తానమాడఁబోయిన తీర్థ మెదురయ్యె. ఇఁక నా కార్యము జయప్రదమగు. సత్య తన ప్రాణములనైన నిచ్చుఁగాని శ్రీకృష్ణుని ప్రాపు నీయదుగదా!

మిత్ర : నాథా! మేము సత్యనేల యడుగవలయును? మీరు సత్యను వలె మమ్ములఁ బెండ్లాడలేదా? మీయెడ సత్యభామకున్నంత చనవు మాకు లేదా?

చ. ధవుఁ డగు నిన్ను వేడిన నెదం గల కోర్కులనెల్ల దీర్తు వం
చవుర! తలంచి భీమసుత యాత్మ మనోరథ నుగ్గడింపఁగా
సవతిని వేఁడు మంచుఁ బలుసారులు బల్కెద వేమి న్యాయమో
సవతి యొసంగునా ధవుఁ డొసంగని వేడుక ప్రాణవల్లభా! 10

జాంబ : ప్రాణేశ్వరా! మీరు రనుదినము సత్యయింటనే బందీగా నుందురుగదా! అట్టిచో మా పుట్టినదినములం దైన మాగృహములకు రాఁకూడదా?

సు. సతియొక్కర్తుక మూరుపట్టుకొని సంసారంబుఁ గావింప నిశ్చితచిత్తుండవయేని, యే మొగముతో శీతాంశుబింబాస్యల న్సతులంగాఁ గొన సాహసించితివో? యే చందంబున న్వారినా తతసౌఖ్యాంబుధిఁ దేల్ప నెంచితివో? నాధా! సుంతయోజింప వే!11

రుక్మి : నెచ్చెలులారా! నాధు నాఁడకుడు దోషము సుఁడీ, (సత్యభామదండ కేగి) చెల్లెలా! నేఁడుమాత్రము ప్రాణేశ్వరుని నాయింటికి రానిచ్చి నలుగురుబందుగులలో నాపరువునిల్పుము. నీకా జన్మాంత మిందులకుఁ గృతజ్ఞురాలనై యుండెద! నీవు "సరే" యనిన నాతఁడు మాటాడక యంగీకరించును.

సత్య : రుక్మిణి! ఇదేటి బేలతనము? నీ ప్రేమచే నీ సపర్యలచే నాధుని యనుగ్రహము సంపాదించి నీ మనోరథంబుల నెరవేర్చుకొనవలయుఁగాని పరుల ప్రార్ధనలచేఁ బతిని స్వాధీను జేసికొన దలంచువారుందురా? సపత్నులు మంచివారైన ధన మిప్పింతురు. ధాన్యమిప్పింతురు. కాని చన విప్పింతురా? దేనినైన నితరులతోఁ బంచుకొనెదరు. కాని భర్తృప్రణయమును బంచుకొనెదరా? ఇంక నీ మాటలుమాని వెడలిపొమ్ము.

రుక్మి : సత్య! నీ వనుదిన మనుభవించు సౌఖ్యము మే మొకపూట యనుభవించిన నీకు లోపమగునా?

సత్య : బేలా! ప్రాణేశ్వరుప్రణయ మెంతయైనా వెక్కస మగునా?

క. ధనధాన్యాదికములఁగని
తనిసినఁ దనియుదురుగాని తరళాక్షులు భ
ర్తనురాగామృతరససే
వనమున నెపుడైనఁ దనియువారలు గలరే? 12

మిత్ర : సత్యా! ఇది నీకాలమని ముందు వెనుకలారయక మాటాడ
కుము ఎన్నటికిని గాల మొక్కరీతిగా నుండదు సుమా!

జాంబ : సత్యా! మాకందరకుఁ బ్రాణేశునుండి వియోగముఁగల్పించి
నీవేమి బావుకొనియెదవు ? నీవు మాత్రము రుక్మిణిని వేడుకొను
కాలము రాకుండునా ?

చ. వనరుహనేత్రు మోహము నవారిగఁ గాంచియు నిట్లు దానితోఁ
దనివిని జెందనేరక శతంబును నాతని నీమబందిగాఁ
బొనరుప నెంతు వీవు వనజాక్షిరో! లోభికి మూట నష్టియౌ
నను జన వాక్యమీయెడ యదార్థముగా నగునేమొ చూడుమా!

రుక్మి : నెచ్చెలులారా! ఊరకుండుఁడు. సత్య నెత్తిపొడుచుటమాని
వేడ్కా లోనరింతము రండు.

సత్య : నాథా! ఈ యాఁడుపులుల నాపైకిరేఁపి వినోదముఁ జూచు
చుండెదరేమి ?

శా. ఈలోలాక్షులు నీప్రియోత్తమను నన్నీలీల నెన్నేని నిం
దాలాపంబుల నాడుచుండనెడ మాటాడంగ మోమోడి, కెం
గేలైనం గదలింపకుండ నగుచుఁ గ్రీగంట వీక్షింతువాఁ
జాలుంజాలుఁ బ్రశంసనీయమగు నీచాతుర్యమాత్మేశ్వరా. 14

మీరీతూష్ణీభావము వదలకున్న నేనిందుండను.
(పోఁబోవుచుండఁ గృష్ణుడు వెన్నాడితోడితెచ్చి)

వసం : (జనాంతికముగా) నే నెన్నియో తెలివిమాలిన పనులొనర్చితిఁ
గాని నామిత్రునివలె నెనిమిదిమంది భార్యల మాత్రము కట్టు
కొననైతి. అట్లే యొనర్చిన నాయవస్థ యెట్లుండియుండునో ?

కృ : సత్యా! ఈ స్వల్పవిషయమున నింత పట్టుదలయేల ? ఇంత
తర్కమేల?

ఉ. ఎన్నడు వేడరాని వనజేక్షణ రుక్మిణి వచ్చి నిన్నునున్
నన్నును నేడు పుట్టిన దినంబని యెంతయుఁ బ్రేమతోడ, మ్ర

ష్టాన్నము లారగింప స్వగృహంబునకు న్దయసేయ వేఁడుచోఁ
గన్నెఱ సేయఁబూనెదవు కంజదళాక్షి ! యిదేటి న్యాయమే ?

నార : (జనాం) ప్రణయాంధులకు న్యాయాన్యాయ వివేచనబుద్ధి యెక్కడిది.

కృ : ప్రేయసీ ! నీవెప్పుడు వైదర్భిసిద్ధాంతములఁ జూడలేదుకదా, నేఁడు చూచెదవుగాని రమ్ము. నీయంతఃపురమునకును దానికిని దారితెన్ను మెఱుఁకఁబడును. (చేఁ బట్టుకొన సత్యవిదలించి)

సత్య : ఈ యిచ్చకముల నా ముందఱ నాడకుము. నీ కంత కోరికగా నున్నఁ బోయి చూడుము. నలినీ, మన కేల యీ గొడవ ? రావె మన యింటికిఁ బోవుదము. (పోఁబోవ)

కృ : (స్వగ) ఓహో శ్రుతిమించి రాగమునఁబడుచున్నదే (ప్రకా) సత్యా నిలువుము నిలువుము. వసంతకా, ఈ విషయమున నీ యభిప్రాయ మేమి ?

వసం : (స్వగ) ఆహా, పాపాలకెల్ల భైరవుండ నే నొక్కఁడ నున్నాఁడ నని దీని నామెడకుఁ జుట్ట నావయస్యుఁడు యోచించినట్లున్నది. కానిమ్ము ఇప్పుడే పక్షము బూనినను నాకొంపపైకి వచ్చును. సతీపతుల వాదముల మధ్యవర్తిత్వము కరము విపత్కరము. కావున మౌనమే నాకు సర్వార్థసాధనము.

సత్య : ధూర్తబ్రాహ్మణా, పలుకవేమి, నీకీ చెవుడెన్నినాళ్ళనుండి ?

రుక్మి : బ్రాహ్మణోత్తమా, న్యాయానుగుణంబుగఁ బ్రత్యుత్తరమిమ్ము

వసం : (స్వగ) అక్కటా, ఈ బెడఁద తప్పునట్లు లేదే? ఏమొనర్తు ?

సత్య : ఏ మింకను నెమరువేయుచున్నావు ? చెప్పెదవా. లేదా ?

కృ : వయస్యా ఏమిది నీ కుశాగ్రబుద్ధికి మించిన విషయమగునా.

వసం : ఈతకు మించిన లోఁతుఁగూడా నుండునా? ఇదే చెప్పుచున్నాను. వయస్యా, రుక్మిణీదేవి యింటికి (సత్యభామ. ఆ,యని యుఱిమి చూడ) సత్యాదేవియింటికి, జాంబవతి బెదరింప) రెండుచోట్లకు బోయి విందొనర్చుట బాగు.

కృ : వయస్యా! ఎంతమంచి తీర్పరివోయి! నీబోటి భోజనప్రియు నకుఁ దగినట్లు పలికితివి.

సత్య : మూర్ఖుడా! ఎవరింటికో యొకరింటికని స్పష్టముగా చెప్పరాదా?

వసం : మీయింటికే, కాదు, కాదు. రుక్మిణీదేవి యింటికే కాదు. కాదు. మీయింటికే. ఏమో నామతి చెడిపోయినది. నన్నుడు గకుఁడు!

సత్య : నాధా! ఈతఁడు మోమోటముచే తబ్బిబ్బు పడుచున్నాడు. ఈతని యభిప్రాయముమాత్రము మీరు నాయింటికి రావ లయుననియే. రండు (చేపట్టి లాగుచో)

జాంబ : రుక్మిణీదేవి! రమ్మురమ్ము. సత్యభామావిధేయుఁడేమి యిత రుల ప్రార్థనల కీకొనుట యేమి? వారికి సత్యాదేవి తిట్లు, తన్నులు మన పూజలు పునస్కారములకంటె వేయిమడుగులు కామ్యంబులు, సహ్యంబులు మగవార లంద ఱింతేకదా!

ఉ. అన్నులమిన్న లెంతయు నయమ్ము భయమ్ముఁ దుఱంగలింపఁ జే
సన్నల నెల్లకాల ముపచారములం బొనరించి పెద్దగా
నెన్నికొలంది ప్రాణవిభు లెల్లిడముఙ్ బచరించుచుండ్రిసీ!
తన్నెడుకాలు ముద్దుగొను తదఙ్ఘులుపో లలితాంగి! పూరుషుల్!

వసం : (జనాం) నిజము. నిజము. ఇందులకు నా వయస్యుని చరిత్రయే తార్కాణము.

సత్య : జాంబవతీ! రసికవర్యుల చర్యలు భల్లూకపుత్రి కెఱుకఁపడునా!

తే. గీ. తాను వలవని సతి మహోదరముకంటెఁ
దాను వలచిన సతి కాలితన్నె మేలు
తాను వలవని సతి ఘనస్తవముకంటెఁ
దాను వలచిన సతి ప్రల్లదమ్మె ప్రియము.

కావున నాథునకుఁ జక్కట్లు దిద్దక నీ దారి నీవు పొమ్ము. రా! నాథా! రమ్ము (పోఁబోవుచుండ)

రుక్మి : (మోకరించి పాదములఁబట్టి) భక్తవత్సలా! మీ భక్తురాలి ప్రార్థన మంగీకరింపరా?

ఉ. నమ్మినవారల న్నిరసన మ్మొనరింప రటంచు నమ్మి ని
త్యమ్ముఁ ద్వదీయ మంగళపదమ్ముల నెమ్మదిఁ గొల్చుచుండ
న్నిమ్మెయి సర్వబంధుజన బృందము మ్రోలఁ బరాభవింప న్యా
యమ్మె శుభావహమ్మె, ప్రణయమ్మె,యశమ్మె,త్రిలోకనాయకా!

నార : నా కిదే యదను (గాన మొనర్చుచుఁ బ్రవేశింప)

కృ : దేవేరులారా! అడుగో నారదుఁడు వచ్చుచున్నాఁడు. రండు ఎదురేగి నమస్కరింతము (భార్యలతో గూడ నమస్కరింప)

నార : ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు.

కృ : నారదమునీంద్ర! మీ రాకవలన మాగృహంబు పావనమయ్యె మఱియు మంచిసమయమునకే వచ్చితిరి. నాకొక ధర్మసంశయ మిప్పుడు కలిగినది.

క మెట్టిన దిన మని సత్యయుఁ
బుట్టిన దిన మనుచు భీష్మపుత్రియు నన్ని
ప్పట్టునఁ బిలుతురు విందున;
కెట్టియెడల నేచటికేఁగ హితవో చెపుమా!

సత్య : నాథా! ఆలుమగల తగవుల నన్యులా దీర్చువారు? మీరు నన్ను రట్టడిపెట్టఁదలఁచినటు లున్నది. నేఁ బోయెద, మీరు వచ్చిన నాతోడ రండు (పోఁబోవుచో)

కృ : లేనిచో?

సత్య : పొండు మీ యిష్టము వచ్చినట్లు, నన్నొల్లనివాఁడు నాకేల? (నళిని కచ్చటనుండ సైగఁజేసి నిష్క్రమించును)

కృ : సత్యా! పోయెదవా? కానిమ్ము నారదా! ఏ మనియెదవు?

నార : దేవా ! నీవు ధర్మకర్తవు, ధర్మభర్తవు, ధర్మభోక్తవు. నీకా నేను ధర్మసంశయము దిద్దువాఁడను!

క. జరిగినది, జరుగనున్నది
జరిగెడునది నీ వెఱుంగఁ జాలియు, నన్ని
త్రటి నీ యడుమజఁ దీర్పఁగ
దఱచి యడుగుటెల్ల నీదు దయచేతఁగదా !

కృ : నారదా ! అడిగిన నుడువఁగూడదా ? సత్యప్రేమ మగణ్యము. రుక్మిణిభక్తి యనన్యము. నాకు వీరిద్దఱ సేవ తెప్రార్థన మంగీకరింపవలయునో తోఁపకున్నది.

నార : భక్తవత్సలా! భక్తజనావనాసక్తుండవై యవతారంబుఁ దాల్చిన మీకు నీ తరుణమునఁ గరణీయమును నేను దెలుపవలయునా?

కృ : అగుఁగాక! వైదర్భి ! నీ యింటికే పోవుదము రమ్ము.

రుక్మి : నాథా ! సంతసమయ్యె. మిమ్ము నమ్మినవారలకు వేఱగునా

జాంబ : (స్వగ) ఈ శృంగభంగము తరువాత సత్యామోహముఁ జూచిన నెట్లుండునో !

కృ : నారదా ! మా కతిథివిగా రమ్ము, దేవేరులారా ! ఇటఁ బోవుదమా ! (నిష్క్రమింతురు)

రుక్మి : నాథా ! ఇటు. ఇటు.

వసం : అక్కటా ! ఈ దిన మేదో ప్రళయము కానున్నది. నాకొంప మీఁదికి రాకుండఁ గోటిదండములు. (నిష్క్రమించును)

నళి : కానిమ్ము. ఈ సంగతి సాత్రాజితీదేవికిఁ దెల్పి పిరివనిఁ బట్టించెద. (నిష్క్రమింప యవనిక పడును.)

## —: తృ తీ య ర ం గ ము :—

స్థలము - సత్యభామ శుద్ధాంతము

(సత్యభామ సెజ్జపై మసలుచు శయనించియుండఁ నళిని విసరుచుండును)

సత్య : నళినీ; నా ప్రాణప్రియుఁడు నా ప్రేమ మగణ్యమని యెఱింగియు రుక్మిణి భక్తురాలని యామానిని ప్రార్థన కీయకొనియెనా? ఇంక నాకుఁ దిక్కెవ్వరు ?

నలి : దేవీ ! మీరిట్లు ధైర్యపడకుండు విధిలేక మీ మనోహరుం డా తన్వంగి గృహంబున కేగెంగాని మక్కువచేతం గాదు.

సత్య : నలినీ ! నీ మాట నెట్లు విశ్వసింతునే ? నా ప్రాణేశ్వరుండే రుక్మిణి భక్తికి సంతసించి యా లతాంగికి వశుండయ్యెనుగదా ? సఖీ ! దీనినిబట్టిచూడ నాకా రుక్మిణిమార్గమే పతిప్రణయంబు నిల్పుకొన నుత్తమమార్గ మగునేమో యని సంశయ మొదవు చున్నది.

ఉ. మ్రొక్కెడువారి చే విడిచి మొత్తెడు వారినె ప్రాణవల్లభుల్
మక్కువతోడం జూతురనుమాటను నెమ్మది విశ్వసించి నే
నక్కరిణిం జరింప వితయయ్యెను నాజతనంబు లెల్ల; నిం
కెక్కడి ప్రాణనాథుం డింక నెక్కడి సౌఖ్యము నాకుం నెచ్చెలీ !

నలి : దేవీ ! భయపడకుము శ్రీకృష్ణుం డెప్పటికిని సత్యభామా విధే యుండు గాకుండండు.

సత్య : నలినీ ! నేంటిచర్యజూడ సత్యభామా విధేయుండనియే తెల్ల మయ్యె.

నలి : దేవీ ! ఒక ముహూర్తకాల మోపిక చిక్కంబట్టి యుండుము. ఎవరిమాట నిజమో తెలియును.

సత్య : చెలీ ! ఒకవేళ శ్రీకృష్ణుం డిటు వచ్చిన వచ్చుంగాక ! వచ్చి యచ్చిక బుచ్చిక నాలుగు మాటలాడి బేలనగు నన్ను వలలో వైచుకొనుంగాక! అంతమాత్రాన జగడాల చీలి నారదునికంట బడిన నా పరిభవము లోక మంతయు వ్యాపింపకుండునా ! శచీ దేవ్యాదులకు సంతసముం గొల్పకుండునా !

నలి : దేవీ ! నీ పరిభవములే నీ విపుల విజయసౌధారోహణమ్ములకు సోపానమ్ములుగదా ! మొన్నటి పారిజాతలతాంతవృత్తాంతము విస్మరించితివా ?

సత్య : దాని నెట్లు విస్మరింతునే ? అయిన నిట్టి పరాభవంబులు ప్రాణాంతకము లగుచున్నవే. ఈ ప్రేమమాహాత్మ్య మేమో

గాని శ్రీకృష్ణుం డొరులయెడ నిసుమంత యనురాగముఁ జూపి నను నా ప్రాణములు లేచిపోవునట్లుండు. నిలువు నీరైపోవు నట్లుండు. ఇట్టియెడ నే మహానుభావులైన శ్రీకృష్ణు మదేక ప్రణయాబద్ధమనస్కుఁ జేయు వశీకరణమంత్ర ముపదేశించిన నాకు సుఖవిచ్ఛిత్తి లేకుండ గాలముఁ బుచ్చ సాధ్యమగుఁగదా?

నలి : దేవీ! దైవ మట్లే యనుగ్రహించును. లెమ్ము, లేచి యిఁకనైన భోజన మొనర్పుము.

సత్య : నలినీ! నీ కేల యీ భ్రాంతి? శ్రీకృష్ణుని మఱలఁ జూడనిది నా కాహారము మ్రింగుడుపడునా? కావున నా ప్రసక్తి వదలుము. (నారదుఁడు దూరమున గాన మొనర్చుచుఁ బ్రవేశింప)

నలి : దేవీ ! ఆ తగవులమారితాపసి యిట్లు వచ్చుచున్నట్లున్నది. రానిత్తునా!

సత్య : దేవర్షుల వారించుట శ్రేయస్కరమగునా ? రానిమ్ము. విశేష ములఁ గనుగొందము.

(నారదుడు ప్రవేశింపఁ సత్యభామ లేచి నమస్కరించును.)

నార : భర్తృప్రణయసిద్ధిరస్తు.

సత్య : మునీంద్రా! దారితప్పి యిట్లు వచ్చినట్లున్నదే?

నార : కల్యాణీ! అట్లనెద వేల! దారిఁ జూచికొనియే యిట్లువచ్చితిని.

సత్య : భక్తాగ్రగణ్యా యగు రుక్మిణిగృహంబు మీబోంట్ల కుచితా వాసము కాని మాబోంట్ల యిండ్లకువచ్చినఁ బాపము సంభ వింపకుంనా?

నార : సాత్రాజితీ దేవి? ఇంతక్రిందటి నాతీర్పా నీకీ యాగ్రహముఁ గల్పించినది? చేలా! నే నెందులకై యట్లు పలికితినో తెలిసి కొనలేవా ? నేను నీ శ్రేయస్కామినిగానా? పారిజాతలతాంత వృత్తాంతమునైనా స్మరింపవా?

సత్య : మునీంద్రా ఆ వృత్తాంతంబు స్మరింప కేమి? అయిన, దానికి దీనికి సామ్య మెద్ది?

నార : స్వల్పపరాభవవ్యాజంబున నీకు మహాప్రమదంబుఁ గూర్చుట. సరే పోనిమ్ము. నేను నీ కపకార మొనర్చితినని తలంచెదవేని నీకు వలసిన యుపకార మొనర్చెద నడుగుము.

నళి : (చెవిలో) నెచ్చెలీ ! ఇందాఁక నీవు కాంక్షించిన యువదేశ మందుట కిదే సమయము.

సత్య : ఆర్యా ! నిక్కువముగా నొనర్చెదరా ? ఒనర్చెదనన్న నా దుఃఖ మంతయు మాయమగు.

నార : నాచేనైన నందులకు సందియమా ? అయిన నీబోంట్లకు నే నేమి యుపకార మొనర్పగలను ? నీబోంట్లకు దుఃఖముగూడ నుండనోపునా ?

సీ. సూర్యాన్వయాంభోధి శుభ్రాంశుఁడైన స
త్రాజిత్తునింట నుద్భవము గాంచి
సౌదర్యసౌశీల్య సౌభాగ్యవతులలో
రూపరేఖాదుల నేపుమీఱి
జపతపానుష్ఠాన సంధానమున నైన
జిక్కని శ్రీకృష్ణుని జెట్టఁబట్టి
సేవ లందుటె కాని సేవించు టెఱుఁగని
సీమంతినులచేత సేవలంది

తే. గీ. ధన్యురాండ్రను నెల్లర ధన్య వయ్యు
నెప్పు డానందవారాసిఁ దొప్పదోఁగ
అన్యకాంతల కైవడి హాయి వీడి
బేల : నీకేల యీలీల జాలిదూల.
భద్రా! నీకేమి తక్కువని నాసాయ మాకాంక్షించెదవు ?

సత్య : ఆర్యా! మీరు చెప్పిన వెన్నియున్నను నేమి ప్రయోజనము ? కుసుమకోమలుల జీవకుసుమములకుఁ బ్రణయమే గదా వృంతము.

శా. ఈ నారీమణు లీ మహాధనము లీ హేలావిశేషంబు లీ
నానాలంకృతు లీనవాంబరము లీ నవ్యాగ్రహర్మ్యంబు లో
మానగ్రామణి! ప్రాణవల్లభుని ప్రేమంబొందు లేకున్న చో
నానందాంబుధి నోలలార్పగలవా? యబ్జాతపత్రాక్షులన్ 22

నార : కల్యాణీ! శ్రీకృష్ణుండు నీకు నిరంతరము విధేయుండయి యుండ నీ కావిషయమునం జింత యేల?

సత్య : మునీంద్రా! అందెంత యాదార్థమున్నదో మీకు నాలుగు గడియలక్రింద గాంచితిరిగదా! బహువల్లభుండగు శ్రీకృష్ణుం జెట్టబడినది మొద లనేకవిధముల నతని ప్రణయమ్మునకు, నాదరణమ్మునకు నేకాస్పదగాం బ్రయత్నించి భగ్నమనోరథ నైతిని ఏల యన?

క. ధనధాన్యాదికముల ధవుం
డొనగూరిచి మఱలం గొనిన నోర్వగవచ్చున్
మనసిచ్చి మఱలం గైకొన
మననగునే మానవతికి మానివరేణ్యా. 23

నార : అమ్మాయీ! అది నిక్కువమే?

సత్య : ఋషిచంద్రా! నా మనోహరుచర్యలు మీకు విదితంబులు గదా! నాకును గోవిందునకు నిందువలనం గలహమ్ము లెక్కుడగు చున్నవి. నాపై దయయుంచి యేదైన నొక వ్రతమునో మంత్రమునో తంత్రమునో సెలవిచ్చి శ్రీకృష్ణు సత్యభామైక విధేయుంగా నొనర్చి పుణ్యము కట్టుకొనుడు. ఇదియ మీరు నాకొనర్పవలసిన యుపకారము.

నార : (స్వగ) ఆహా! ప్రేమ యెంత స్వార్థలాభకాంక్షి? ఇంక నా పన్నుగడ సఫలము గానున్నది.

సత్య : ఆర్యా! ఏమూరకుండెదరు? మీకిది సాధ్యము కాకుండునా?

నార : సాధ్యము కా కేమి? వినుము పూర్వము శచి, గౌరి, అరుంధతి మున్నగు నారీమణు లొనర్చిన వ్రతం బొందుకలదు. దానిని

బుణ్యక వ్రతమనియు! నిష్టప్రసిద్ధివ్రతమనియు వ్యవహరింతురు. దాని నాచరించు సతీమతల్లులు ధనోపేతలై, పుత్రవతులై సతులలో నఱగొఱ లెఱుంగక యనితరసులభైక సుఖాస్పద లగుదురు.

సత్య : ఇట్టిదియు నా కవశ్య మాచరణీయంబు దాని విధానముం దెలియఁజేయుఁడు.

నార : సావధానచిత్తవై యాకర్ణింపుము. ఒక శుభదినంబునఁ బ్రాతః కాలమున సభర్తృకంబుగాఁ బుణ్యనదీతోయంబుల స్నాన మాడి సర్వాలంకృతవై వ్రతమొనరించి పేరంటాండ్ర బూజించి వ్రతోద్వాసన క్రియావేళకు——

మ. కో. శాంతచిత్తు విశిష్టవంశజు సజ్జనీనచరిత్రు వే
దాంతశాస్త్రవిశారదున్ శుచియైన తాపసపుంగవున్
గాంతరో! పిలపించి వానికిఁ గాంచనాదుల నిచ్చు నీ
కాంతు దానమొసంగు మంతనె కామితం బొనగూడెడున్.

సత్య : మునీంద్రా! ఏమేమి! భర్తృదానమా? బాగు, బాగు!

చ. వ్రతము లొనర్చుకాలమున వారిరుహాస్యలు శక్తియుక్తిమై
క్షితిసురకోటికిన్ మణివిశేషధనాంబర ధాన్యవాహన
వ్రతతుల దానమిచ్చిన శుభంబని యిత్తురుగాని, యెవ్వరేన్
బతులను నిత్తురయ్య, మునినాథ! వ్రతాచరణాభిలాషయై?

నార : బేలా! భీతిల్లకుము. ఈదానము నాకు మాత్రమే సుమీ! దానమిచ్చిన భర్తను బ్రతిగ్రహీతకు భర్తయంత బరువగు ధనముగాని, ధనములేకున్న ధనేతరముగాని తూచియిచ్చి పతిని మఱల గ్రహింపవచ్చు. నీయొద్ద కృష్ణునెత్తు ధనముగాని యితర పదార్థములుగాని లేనప్పుడే నీవు భర్తృదానమన్న వెనుదీయ వలయు.

సత్య : మునీంద్రా భర్తృదాన మన్న నింతమాత్రమే యగునా? ఏమోయని భయపడితిని. ఇంతియైనఁ దప్పేమి యొనర్చెద.

ధనములకు నాకేమికొఱత? శ్రీకృష్ణుం డెంద రెందరు రాజులనో జయించి నాకుఁ దెచ్చియిచ్చిన ధనంబులు లేవా? దినమునకు రెండు బారువుల బంగార మొసంగుచుండు నా తండ్రి యిచ్చిన శమంతకమణి నాయొద్ద లేదా!

నారద : ఉండవచ్చునుగాని వానితోఁ గృష్ణుఁ దులఁదూచవచ్చునో లేదో సుంత యోచించి వ్రతంబునకుఁ గడంగుము. పిదపఁ బశ్చాత్తాప పడి ప్రయోజనము లేదు.

సత్య : మునీంద్రా! నే నీ వ్రతమును జయప్రదముగా నొనర్చిన రుక్మిణ్యాదులగతి దుర్గతి యగునని మీ ఇట్లు నన్ను భయపెట్ట జొచ్చెదరు? నాదగ్గఱనున్న ధనముతో నొక్క కృష్ణుని కాదు, కోటికృష్ణులఁ దూచవచ్చును అంత స్వల్పధనము నొరుల కిచ్చిననాకుఁ జిన్నఁదనమగుఁ గాన నాసర్వస్వమును నొసంగెద! మీ రుపదేశించిన వ్రతమువలన శ్రీకృష్ణప్రణయధనమెల్ల నాకు వశీకృతము కానుండ నాకితరధనంబు లేల?

నారద : (స్వగ) ఏమీ మూఢవిశ్వాసము! సమగ్రజ్ఞానంబునుంబోలే సంపూర్ణమగు సజ్ఞానంబును నిర్వృతిహేతువుగదా! (ప్రకా) దేవీ! కృష్ణుని బరువు ధనముగాని, ధనేతరముగాని ముందిచ్చి తర్వాత నీయిష్టప్రకార మొసఁగవచ్చును. అయిన శ్రీకృష్ణునితోఁడ బారిజాతంబుగూడ నీయవలయు.

సత్య : అట్లే యిచ్చెదను. శ్రీకృష్ణుఁడు నాపాలిటి పారిజాత మగుచుండ నాకా తుచ్ఛపారిజాతవృక్షం బేల? ఈ ప్రశంస వదలి యింక దీనికి శుభదిన మెప్పుడో సెలవిండు.

నారద : కళ్యాణీ! ఱేపే శుభదినము అయిన నీ భర్తను దాన మెవ్వరి కీయఁదలఁచితివి? అతఁడు నేను నుడివిన లక్షణము లన్నియు గలవాఁడుగా నుండవలయును. మీఁదుమిక్కిలి దేవర్షిగాని బ్రహ్మర్షిగాని యైన మఱియు మంచిది.

సత్య : మునీంద్రా! సర్వలక్షణసమన్వితులును దేవర్షి పుంగవులును నగు మీరుండ నే నన్యుల కిత్తునా? మీరే నా భర్తృదానమును బ్రతిగ్రహించి న న్ననుగ్రహింపవలయును.

నార : కళ్యాణీ! ఈ దానపరిగ్రహణంబున నే ధన్యులలో ధన్యుఁడ నయ్యేద.

సత్య : నేనును ధన్యురాండ్రలో ధన్యనయ్యెదఁగదా!

నార : నిస్సందేహముగా, అయిన నీప్రాణేశ్వరుఁడిందుల కీయకొనునో లేదో? ఆతని యంగీకారమునకై యింకఁ బ్రయత్నింపవలయు.

నలి : దేవా! ఆ ముకుందుఁడిందువచ్చిన నా నెచ్చెలి కదెంతపని?

నార : ఇదే ఇప్పుడే యిచ్చటికి వచ్చుచుండును. సత్యాదేవీ! తర్వాత నంతయు నీ చేతులలో నున్నది.

సత్య : మునిసత్తమా! ఆ విషయమున మీరావంతయు సంశయింపకుఁడు. నామనోహరు నిందులకు దప్పక యొప్పించెద. రేపు ప్రాతఃకాలమున మీరువచ్చి వ్రతమును జేయింపవలయును.

నార : భద్రా! వ్రతవిధానమును మీ పురోహితుఁ డెఱింగినవాఁడు. ఆతఁడే దానిని జేయించును. నేను వ్రతమును దిలకింప వచ్చెదను ఇఁక నే బోవచ్చునా?

సత్య : అట్లేపోయిరండు, రేపుదయముమాత్రము తప్పక రావలయును.

నార : తప్పక వచ్చెద ఆ విషయమై సందియపడకుము. (నిష్క్రమి)

సత్య : నలినీ! నాయదృష్టమున నీవిధాత్మనందనుఁ డరుదెంచి నే వలచిన వరమును వాకృచ్చె. ఇఁక నట్లాచరించి కృతార్థత గాంచెద. (నగలఁ గొన్నిఁ టిఁదీని) ఈనగల భద్రమొనర్చుము. కోపగృహమున కేగి కోప వేషముఁ దాల్చెద. అబలలకు వీరాధివీరుల నేని లోఁబరచుకొన సమర్థములగు సాధనములు కోపాశ్రువులేగదా!

నలి : దేవీ! ఇందులకు మీ చరిత్రమే తార్కాణము.

సత్య : నలినీ! నీవు ద్వారముకడ కేఁగి వాసుదేవుఁడుగాని, యతని వయస్యుఁడుకాని వచ్చిన గొంతగాలము లోపలికి రానీయక బెట్టుసేయుము.

నలి : తప్పక యట్లేయొనర్చెద.

సత్య : ఇకఁ బోవుదము రమ్మా.

(ఇద్దరు చెరియొక వైపున నిష్క్రమింప యవనికపడును)

## : తృతీయరంగము :

స్థలము : ద్వారకాపురి రాజవీధి.

(శ్రీకృష్ణుఁడు వడివడిగా ముందు నడచుచుండ వసంతకుఁడు మెల్ల మెల్ల వెన్నాడుచుండును. నలిని యొకవంకఁ గావలి గాచుచుండును.)

వసం : (నడువలేక నడచుచుఁ బ్రేచుచు, రొజుచు బొట్టదడివి కొనుచు) వయస్యా? వయస్యా! కొంచెము మెల్లగా నడువవోయి. నాకుఁ గాళ్ళు పడిపోవుచున్నవి. రుక్మిణీదేవి పెట్టిన బూరెలు, గారెలు, నాకడుపులోఁ జేరి కోలాహల మొనర్చుచున్నవి.

కృ : వసంతకా! ఈ వేళాకోళపు మాటలు మాని వడివడిగా రమ్మా. సత్య నా దర్శనమునకై న యెంత పరతపించుచున్నదో? నన్నెంత కఠినహృదయుఁడని దూరుచున్నదో?

వసం : ఆ సత్యదేవి నీకై పరితపింపనేల ? "ఇష్టమైన రమ్మా" లేక పోయినఁ బొమ్మా, అని చెప్పి యెత్తినకాలు దించక వెడలి పోయెఁగదా ?

కృ : వయస్యా! అట్లనిన నావెంటనే రమ్మని సత్యయర్థము సుమా!

వసం : పొమ్మన్న రమ్మనియా యర్థము ? ఏమీా యీా విపరీత వాఖ్యానము ?

కృ : ఇట్టి విపరీతవాఖ్యానమే కాముకులు కామినుల పల్కుల కొనర్పవలయు

వసం : అట్లయిన వారిహృదయముఁ గనిపెట్టు టతికష్టమే

కృ : అందులకు సందియమా ?

చ. ప్రమదలఁకూడి చూడఁగనే వారిమనోగతు లెల్లఁ దేట తె
ల్లముగ స్ఫురించె నంచును దలంతురు పో మగవారలార! స
త్యముఁ గనుగొన్న నెంత రసికాగ్రణికైనను నారి కేళపా
కముగదా! కామినీహృదయ కావ్యరసగ్రహణంబు నెచ్చలీ! 27

వసం : ఒహో! చాల విచిత్రమే.

కృ : ఇదిగో చూడుము. ద్వారమున నుండునది నలినిగదా నేనను కొనునట్లు సత్య దీనిని మనకు లోనికిఁ బ్రవేశము గలుగకుండఁ గావలి పెట్టియున్నట్లున్నది?

వసం : అట్లయినఁ గష్టము వచ్చినదే అయిన వయస్యా! రుక్మిణీదేవి గృహమున కేఁగినంత నీసాత్రాజితికింత తామసమేల? అంతతో నీప్రేమ మంతమయ్యె నని తలంచినట్లున్నదే ?

కృ : వయస్యా! ప్రేమగలవారి భ్రాంతులకు బలిష్ఠకారణములు వలయునా?

మ. వనకాంతాంబకుఁ డెల్లకాముక మనోవప్రబులం దర్థమై
ననురాగద్రవిణంబు దాఁచి విచికిత్సాఖ్య ప్రతీహారిఁ ద
ద్దవరత్కోర్ధము నిల్పఁగా నతడు మధ్యాసాధ్య సాక్రందని
ధ్వనులన్ జేయు సదా హితాహిత విభక్త జ్ఞానశూన్యాత్ముఁడై

కానిమ్ము ఈ సత్యయాట లన్నియు నింకొకదినమే లెమ్ము.

వసం : ఇదినిజమేని నీవును నేనును గృతార్థులమే.

కృ : అట్లేయగు అయిననుఁ బ్రస్తుత కర్తవ్య మేమి ? సత్యను జేరు టెట్లు ?

వసం : వయస్యా! నిన్నుఁబోలు దక్షిణనాయకునికి దెలియని యెత్తు లున్నవా ?

కృ : నేనేఁగిన నలిని మరియు బిటింపుఁ జూపు నేమో ? నీవు ముం దరిగి నాకుఁ బ్రవేశ లభ్యపడు నట్లొనర్పుము.

వసం : అ దెంత? అవలీలఁగాఁ జేసివచ్చెద నింద్ దే యుండుము.

(కృష్ణుఁడెడముగా నుండును. వసంతకుఁడు నలిని వైపునకుఁ బోవుచో)

నలి : (స్వగ) అడుగో! కృష్ణులవారినీడ వసంతయ్య వచ్చుచున్నాడు. మా దేవి యాజ్ఞాపించినట్లు వారించెదగాక! (వసంతకుఁడు తల వంచుకొని లోని కేఁగబోవుచో నడ్డమువచ్చి) వసంతయ్యా ఏమిది? కన్నులుమూసికొని పోవుచున్నావు.నిల్వుమునిల్వుము.

వసం : ఓసి దాసీ! ఏమి కండకావరమే! నాబోటి బ్రాహ్మణ శేఖరు నడ్డగించెదవు ?

నలి : నిన్నును నీవయస్యుని లోనికి రానీయవలదని మా దేవియాజ్ఞ.

వసం : నావయస్యుఁ డిక్కడికి వచ్చినఁగదా !

నలి : ఏమయ్యా! అట్లనెదవు? నీవయస్యుడు నీ వెనువెంట లేఁడా ?

వసం : ఉన్నాడో లేఁడో నీకుఁ గనపడుటలేదా ? ఇంతకు కన్ను లున్నవే? నావయస్యుఁ డింకఁ దన్ను దైవవలెఁ గన్నుల నద్దికొనుచు నడుగులకు మడుఁగు లొత్తుచుఁ బూజించు రుక్మిణీ దేవి యింటనే యుండును. కలయప్రియ యగు మీా దేవి మొగము గూడఁ జూడఁడులే.

నలి : ఏ మేమి? ఇది నిజమగునా?

వస : నిజముగాకున్న నీతో నెకసక్కెము లాడవచ్చితిననుకొంటివా ?

నలి : అట్లయిన నీవార్త మా దేవి కెఱిఁగించివచ్చెద. ఇందుండుము.

(నలిని తత్తరపాటున నిష్క్రమింపఁ గృష్ణుడు వసంతుకునిదాసి)

కృ : వసంతకా! బాగుబాగు! ఎక్కడ నేర్చితివోయీ యీ టక్కరి తనము!

వసం ; వయస్యా! ఇదంతయు నీతోడి సహవాసఫలమే.

కృ : (నవ్వుచు) వయస్యా! చాలుఁజాలు రమ్ము, మనమును లోని కేగుదము.

వసం : వయస్యా! అట్లే యొనర్తుముగాని యొకమాటఁ జెప్పెదఁ గోపగింపవుగదా!

కృ : వసంతకా! నీమాటలకు నాకు గోపము వచ్చునా? ఏమది?

వసం : శ్రీకృష్ణుని చెవిలోఁ ఈసారి సత్రాజితీదేవి కోపము దీర్చునపుడు కాళ్ళవైపునఁగాక తలవైపున నిలువుము.

కృ : (నవ్వుచు) వసంతకా! ఇఁక నీవేళాకోళము మాని రమ్ము.

(నిష్క్రమింతురు.)

## క్రొత్త నాటకములు

| | | |
|---|---|---|
| కర్ణదారి | పూటుకూరి | 1-4-0 |
| దానవీరకర్ణ | సోమరాజు | 1-8-0 |
| ప్రతాపరుద్రీయము | ,, | 1-12-0 |
| ఖిల్జీరాజ్యపతనము | గుండిమెడ | 1-12-0 |
| ధరణికోట | సోమరాజు | 1-12-0 |
| కోకిల | పానుగంటి | 1-12-0 |
| విప్రనారాయణ | ,, | 1-12-0 |
| మధుసేవ | ,, | 1-12-0 |

—: ప ం చ మ ర ం గ ము :—

స్థలము : సత్యభామ కోపగృహము

(సత్యభామ నగలఁ దాల్చక మలినవస్త్రముఁ గట్టి ముసుగువైచుకొని పరుండి యుండును. నళిని సంభ్రమముగాఁ బ్రవేశించి)

నళి : దేవీ! దేవీ లెండు. నేఁడు మొదలు మాహారాజరాజేశ్వరుఁడు, రుక్మిణీదేవి మందిరముననే యుండునట.

సత్య : (చివాలున లేచి) ఏమీ ఛీ ఎవరే నీకీవార్త చెప్పినది?

నళి : వసంతయ్య దేవీ!

సత్య : ఛీ! ఛీ! నే నీవార్త నమ్మజాలనే శ్రీకృష్ణుఁడేమి? నన్నిట్లు తెరతేరకు విడనాడుటేమి? ఇది యాబ్రాహ్మణ బ్రువుని స్వకపోలకల్పనమే! నారదమునీశ్వరుఁ డతః డిందు వచ్చుననలేదా?

(వసంతక సహితుఁడై శ్రీకృష్ణుఁడు ప్రవేశించి సత్యభామ కన్నులు మూయ)

సత్య : ఎవరిది? (చేతులు దడివి కృష్ణుఁడని గుర్తించి చేతులు విదలించి కొని) నాదగ్గఱకు రాకుము. ఎడముగాఁ బోయి పెడమొగముగా నిలుచును.)

కృ : సత్యా! నాప్రేమనైజము బాగుగా నెఱింగియు నీ వింతమాత్రమునకుఁ గోపింపఁవచ్చునా? చూడుము.

ఉ. అన్నులమిన్న! భీమసుతపార్థనఁ ద్రోయగలేక యెట్టులో
కన్నులు మూసికొంచుఁ దమకంబును జిక్కఁగఁబట్టి భీతి పై
కొన్నటు లొండురెండు మొసుకు ల్దిని నీ విరహానలంబు నీ
విన్నఁదనంబుబాప నతివేగము వచ్చితి నాదరింపవే! 29

నావైపునకు దృష్టి ప్రసరించి వలపులొలుకు నీ చిలుక పలుకుల నాయలజడి మాన్పుము. (దండ కేఁగ దూరముబోవ) ఒక్కసారి ప్రసన్నావలోకనంబుల నావంకఁ దేరిచూడుము.

ఆ. వె. అంతుపొంతులేని యనురాగవారాశి
దాఁట నాకు మార్గదర్శకములు
గాఁ జరించు నీదు కంటెరెక్కల దాఁచ
దిక్కు తెలియు టెట్లు టెక్కులాఁడి? 40

వసం : బహువల్లభత్వము నా పగవానికైనను వలదుసుమా. (నలిని తోడ నెడముగాఁ బోయి నిలుచును)

కృ : సత్యా! మనోవాక్కాయ కర్మంబుల నిన్నుఁదక్క నే నన్య కామినులఁ గామించువాఁడనా? మెఱమెచ్చులకు వారినించుక గారవముతో జూచెదఁగాక! నిక్కువముగా నిన్నే ప్రేమించు వాఁడ నని మఱచితివా!

సత్య : కుటిలజనవిరోధీ! ఈ నయగారపుఁ బల్కులు నీ తెచ్చుకోలు వలపులు నీకు వెన్నతోఁ బెట్టిన విద్యలుగదా!

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము బందుగు మిత్రుఁడున్మనో
వల్లభుఁ డొక్కఁడే యని సపర్యలఁ బ్రేముడిఁ జేయుచుండు న
న్నెల్లరుఁ జూఁచుచుండ నటు తెల్లిదముం బచరించి యంతంబో
కల్లరిఁజేయ వచ్చితివె? యాత్మసతీ ప్రణయైక వంచకా! 31

కృ : నీవు నన్నెఱుఁగనట్లు పల్కెద వేల? నేను నీదాసుండనుగానా? దాసులపై కోపము దండముతో సరి. ఇదిగో నీకు మ్రొక్కెద నన్ననుగ్రహింపుము.

(దండ కేఁగి మోకరింపఁబోవ)

సత్య : దూర ముండుము చాలుఁజాలు, నీమృషోక్తులు, నిన్ను నీ దాస్యమును నమ్మి చెడితిని.

మ. ఇఁక నేగీచినగీటు దాట నని యెన్నోసార్లు నాదండ ని
చ్చకముల్ నచ్చఁగఁ బల్కువల్కు తుద కాచందాన స్వస్త్రీలలో
నొకసక్కెంబుల పాలుచేసి యిటు రానేలా? యొకేసారి కు.
త్తుక ఖండించి సపత్నులు గలిసి సంతోషింపఁగా రాదొకో! 32

కృ : ప్రేయసీ? ఇట్టికఠినోక్తులు నాయెడ దగునా? ఇకనైన నీప్రణయ కోపంబు వదలి నీవు సుఖించి నన్ను సుఖింపఁ జేయుము. ఈ వసంతర్తువున నిట్టి ప్రణయగోపము ప్రాణాంతకమగు. అదే యీ గవాక్షమార్గమునఁ జూడుము.

తే గీ, ప్రణయకోపమ్ము విడకున్నఁ బ్రాణహాని
తథ్యమని దంపతులకు మాధవుఁడు దెలుపఁ
బత్రముల సుమాక్షరముల వ్రాసికట్టెఁ
బాదపోపశాఖల నూనె ప్రకటనముల.

(చిబుకము నిమురఁబోయి విదల్పఁబడి) ప్రేయసీ? ఇంకను నీ మాధ్యమేనా? నామాట విని, తర్వాత...

సత్య : నీమాట వినియే నే నీయవస్థకు వచ్చితిని. ఇంక నన్ను విడిచి పోయి నిన్ను భక్తితోఁ గొల్చు వడతుల నమ్మించి గొంతు గోయుము. నీ కింక నా ప్రేమ మెందులకు? [చెవులఁ వ్రేళ్లుంచు కొనును]

కృ : ప్రియా! ఇంతవఱకు నే నప్పుడప్పుడు చూచుచున్న యుదా సీనతకుఁ గారణము లేకపోలేదు. నాకు నీయందలి ప్రేమ మంగ ణ్యము, అనిర్వార్యము. అఖండము. (సత్యభామ సంశయము సూచించును) ఇందులకు నాయంతరాత్మయే సాక్షి. వలపులు హృదయైక సాక్షికమ్ములు, గాన నే నింతకంటె నేమి నుడువఁ గలను?

సత్య : నీచర్యలో—

కృ : నాచార్య లన్నియు నాకు నీయెడగల ప్రేమకు సూచకములే ?

సత్య : అవునవును. నన్నుఁ దిరస్కరించుటగూడ నీ ప్రేమకు సూచ కమే యగునా?

కృ : నిస్సంకోచముగా, ఆ సంతోషమభ్యుదయమున కాలవాలము గదా! ఈ రహస్యముం గనుంగొని నీకు నేడుంబోలె నప్పు డప్పుడు సపత్నులం దనుపునట్లు వటించి యసంతుష్టిఁ గలిగించి

నిజముగా నీచేత వరముల నడిగించుకొని సంతసమందఁ దలఁచు
చుందు. నిన్ను సంతసపెట్టఁ దలఁచుచుందు.

మ. నిరతంబున్ భవదీయకింకరుఁడనై నే నున్న నీవంతతోఁ
బరితృప్తింగని నన్నిఁ కేవరములం బ్రార్థింప వేమో యఁటం
చరవిందాక్షీ! సపత్నులం దనిపి నీ కందం దసంతుష్టిఁ జే
కురంగా జేసి వరంబు లీఁదలఁతు బోనాడుమా?

సత్య : (దండ కరగి) నాథా! ఇది విశ్వసనీయమా? నిక్కువమా?

కృ : బేలా! నిక్కువము గాకేమి? పారిజాతలతాంతవృత్తాంత
మించుక స్మరింపుము. వలసిన సతి కోరినవరము లొసంగి సతిని
దనిపి తాను దనియుట పతిధర్మము గాదా!

సత్య : అయిన మీరు నాచే వరముల నడిగించుకొనుటకా యిట్లొ
నర్చునది.

కృ : సత్యా! అంతనమ్మకము లేకున్న నివ్వొ డొకవర మడిగి
పరీక్షింపరాదా?

సత్య : (స్వగ) ఇక నారదుఁ డాడినట్లొనర్చెద ప్రకాశముగా—
చేఁబట్టి) అట్లే కానిండు.

ఉ. ఇంతకుమున్నె నారదమునీశ్వరుఁ డిచ్చటి కేగుదెంచి, నా
కెంతయుఁ బ్రీతితోడ సెలవిచ్చె వ్రతం బొకఁడాచరింపు మ
త్యంతశుభావహం బగు నఁటం చటు సేయఁగ నీదు సాయ మొ
క్కింతయవశ్య మోవనరుహేక్షణ!' దానినొనర్తు? చెప్పుమా.

కృ : సత్యా! నారదుడు వ్రత ముపదేశించియుండ నీవు దాని సల్ప
నుండ నా సాయమునకు సందియపడనేల? చెప్పుట కాలస్యము
గాని, చేయుటకాలస్యము గలుగఁబోదు.

సత్య : హృదయేశా! నారదుఁడు నన్నుఁ బుణ్యకవ్రత మాచరింపు
మనియె దాని విధానమును మీరా రెఱుఁగుదురా?

కృ : ప్రేయసీ! నిరంతర నారీవిహార సంసక్తచిత్తుండ నగు నా కా

వ్రతవిధాన మెట్లిఉుకపడును? అద్దెట్టిదైనను త్రికాలవేదియగు నారదమహార్షి నుడివినదికాన నవశ్యా కర్తవ్యంబు.

సత్య : ప్రాణవల్లభా! అందుల కొక దాన మావశ్యకము, దానిని వేడ వెనుదీయుచున్న దాన.

కృ : ఏమది ? ధనములా ? ధాన్యములా ? నగలా ? హార్మ్యములా ? మణులా ?

సత్య : అవికావు మీా యనుగ్రహమునఁ దండ తండములుగా నయ్యవి నాదండలేవా ?

కృ : ఇంకేమివలయు? దాస దాసీజనంబులా ? రాజ్యములా ?

సత్య : కావు కావు ఇంకను నూహింపుడు.

కృ : అయిన నెద్దియో నీవే నుడువవలయును. నాకేమియు తోఁచుట లేదు.

సత్య : మీారు దాని నూహింపలేమని యొప్పుకొనియెదరా? అట్లయిన దగ్గరకురండు చెవిలోఁజెప్పెద. (కృష్ణుడు రా జెవిలో) భర్తృ దానము సుడీ ?

కృ : సత్యా ! ఏమిదానము ! భర్తృదానమా ! నీ ప్రేమ మింత మాత్రమే యగునా !

చ. 'అసదృశరాగమొప్ప భవదంఘ్రి సరోజయుగంబుఁ గొల్తు నా కసువులు గల్గునందనుక' నంచు వచించియు నిట్టులన్యకై వస మొనరింపఁ జూచెదవు భామ! నావయి ప్రేమ మాసెనో వినుఁగు జనించెనో మదికి వెక్కసమయ్యెనో నా చరిత్రముల్ ?

సత్య : ప్రాణేశా! అట్టిదసంభవమని మీాకు దెలియదా? మీాపూర్ణాను రాగైకాస్పదనుగా నీ వ్రతము నాచరింప నిశ్చయించుకొంటి, వ్రతాంతమున మీా దాన మావశ్యకమఁట !

కృ : సత్యా! ఇది వింత వ్రతముగా నున్నదే! నన్నెవరికి దానమియ్య నిర్ణయించితివి ?

సత్య : ఎవరికో యననేల? మిమ్ముల నిరంతరముఁ గొనియాడు నారద మునీంద్రునికే.

కృ : ఓహో! నారదునకు నన్ను దాన మిచ్చెదవా? సత్యా! నేను నీదాస్యము ననాయాసముగా నొనర్పగలను గాని యీ జడ దారి దాస్యము నొనర్పఁగలనా?

సీ. కస్తూరికాతిలకమ్మును బోనాడి
యూర్ధ్వ పుండ్రంబుల నుంచు మనునో?
మౌక్తికహారినీల మణిహారముల మాని
తులసి పేరుల మెడఁ దొడుగుమనునో?
పీతాంబరంబును వీడ్కోలు గావించి
కాషాయవస్త్రంబుఁ గట్టుమనునో?
లలనామణీ సంగలౌల్యంబు విడనాడి
సంయమివ్రతమును సలుపు మనునో?

తే. గీ. యింక నేమి వల్లెదనునో యేమి సేయు
మనునో? యీ కలహాశనుఁ డాత్రిలోక
గమనుఁ డాసంయమీంద్రుండు కలికి? యతని
వశము ననుఁ జేయంగా నీకుఁ బాడియగునె?

సత్య : మనోహరా! మీ మిమ్మాతనికి దాస్య మొనర్పనిత్తునా? దాన మొనర్చిన యుత్తరక్షణమే మిమ్ము బ్రతిగ్రహింపకున్న నేను జీవింప గలనా? మీకింత మాత్రము తెలియదా?

కృ : సత్యా! తెలియక కాదు. పరిహాసమున కట్లంటి. సంశయింపక నీయిష్టానుసారము దానమిచ్చి నీమనోరథంబు నీడేర్చుకొనుము.

సత్య : నాథా! నీబోటిపతులుగదా, సతులపాలిటి పారిజాతములు! ధనేతరముఁగాని యిచ్చి మిమ్ము మఱల గ్రహించెద.

కృ : ప్రేయసీ! నన్నుఁ దూపగలధనము నీకడ నున్నదిగదా?

ప్రణయమున నన్నుఁ దూఁపగల ద్రవ్యము లేక యపుణ్యక వ్రతో
పాసనమం కడంగ నెడబాటు నెపమ్మున నీకు నాకును

నోము సమువచ్చుఁ గాన మునుముందుగ నెమ్మది నుంత యోజనం
జేసి కడంగు మీ వ్రతముఁ జేయ సరోరుహ పత్రలోచనా! 28

సత్య : నాథా ! నారదమహర్షి వలె మీరును నాకడ నుండు ధన ధాన్యాది సంభార పరిమాణ మెఱుంగ నట్లాడెదరేల ? ఇందు లకు మీ రావంతయు సంశయింపకుఁడు.

కృ : సత్యా! నారదుఁడుకూడ నీ ధన పరిమాణముం గూర్చి సంశయించెనా ?

సత్య : అతఁ డజ్ఞాన వశంబున నట్లాడె. పోనిండు ఇంక నూరిలోఁ బిలువ నెవరిఁ బంపుదము.

కృ : మన వసంతకునిఁ బంపుదము. వసంతకా! నీవేగి యీ యూరి బ్రాహ్మణ్యమును భర్తృదాన వృత్తాంతముఁ దెల్పక రేపటి వ్రతమునకుఁ బిలిచి వచ్చెదవా?

వసం : తప్పక పిల్చివచ్చెద. రేపు నాకు భూరిసంభావన నీయవలయు సుమా!

కృ : అట్లే. పోయిరమ్ము. (వసంతకుడు నిష్క్రమింప)

సత్య : నళినీ! నీవేఁగి ముత్తైదువల బిలచిరమ్ము. (నళిని నిష్క్రమింప)

కృ : సత్యా! నా తలిదండ్రుల, నన్నదమ్ముల, నీ సపత్నుల మాత్ర మాహ్వానింపకుము. వారీదానమున కడ్డుపడెదరేమో?

సత్య : నాథా ! బ్రాహ్మణ్యమును దక్క బంధువర్గమును బిలువ దలపలేదు. ఇంక లోనికేగి రేపటి వ్రతమునకు వలసిన కార్య సన్నాహ మొనర్తుము. రండు.

కృ : ప్రేయసీ! ఆ వసంతకుడు బ్రాహ్మణుల నాహ్వానించుట యందెట్టి వికట చేష్టలొనర్చునోయని నామనంబు కళవళపడు చున్నది.

సత్య : హృదయేశా! ఏమొనర్చిన నేమి? మీ ప్రేమాంబువృష్టి నాయెడ వెల్లివిరియుచుండ నాకొండు భయావహంబగునా?

కృ : చేలా! నీ కుశంక లన్నియు రేపటితో నిర్మూలమగు. అంతట నీవు ధన్య వయ్యెదవు.

సత్యా : నిక్కనముగా ధన్యనయ్యెద. ఇదంతయు నారదమునీంద్రుని మొక్కయు మీరా మొక్కయు అనుగ్రహఫలమేగదా! ఇకరండు లోనికేగుదము.

కృ : (స్వగ) జెప్పు సత్య నిక్కముగా ధన్యయగుఁగాని, తా నను కొనునట్లుకాదు. (ప్రకా) సత్యా! రమ్ము.

(నిష్క్రమింప యవనిక పడును.)

# శ్రీకృష్ణతులాభారము

## తృతీయాంకము

స్థలము: సత్యభామ శుద్ధాంతము.

[శ్రీకృష్ణుడు పట్టువస్త్రములఁ దాల్చి యాసీనుండై యుండ వసంతకుఁడు దండ నిల్చియుండును.]

కృ : వసంతకా! భర్తృదానమును తులాభారమును గూర్చి ఎవ్వరితో నుడువలేదుగదా!

వసం : వయస్యా! అన్నియిండ్లలోను రెండుమూడు కల్లలాడి తప్పించుకొంటినిగాని, కాని –

కృ : వయస్యా! ఏమట్లు సంశయించుచున్నావు? ఎవ్వరితోనైనఁ జెప్పితివా యేమి?

వసం : పరులతో నెవ్వరితోడను గాదు. మా యింటియామెతోడనే. దానికడ నా బొంకులు చెల్లిగవ్వ కక్కఱకు రాలేదు. అది గుచ్చిగుచ్చి యడిగి కనుగొనలేక గుట్టు బయటఁ బెట్టినఁగాని భోజనము బెట్టనని యె. అప్పుడు విధిలేక చెప్పవలసివచ్చె. చెప్పినప్పటినుంచి తానుగూడఁ బుణ్యకవ్రత మొనర్చెదనని పట్టుబట్టె.

కృ : వసంతకా! నీభార్యకూడ నేడు బుణ్యకవ్రత మొనర్చునా యేమి?

వసం : అదియు, సత్యాదేవియు నెచ్చెలులు ఒక యాకునసే చదివిన వారు

కృ : తరువాత నేమి జరిగినది?

వసం : నే నప్పుడు సరేయని యంగీకరించితిని. కాని మరలనన్ను దాన మొనర్చి నీ పేరులేని ప్రతిబంధము పెనిమిటి తొలగిపోయిన దే చాలునని గ్రహింపదేమో? ఎవరికి దాస్య మొనర్పవలసి వచ్చునోయని యుదయమున నే వ్రతమునకు సన్నాహ మొనర్చి వచ్చెదనని నీకడకుఁ బరుగెత్తి వచ్చితి.

కృ : వయస్యా! నీభార్య మనగుట్టు బయటబెట్టునా?

వసం : అందులకు సందియ ముండదనియే నా యభిప్రాయము. సము ద్రమునైన మూయవచ్చుఁగాని దానినోరు మూయఁ దరము గాదు.

కృ : పోనిమ్ము. దాన మనకేగు కొంత యేమియులేదు. (నారద గానము వినబడ) అదుగో నారదుడుగూట వచ్చుచున్నాడు. నీవు లోనికేఁగి సర్వము సిద్ధముగా నొనర్పుము. నేనును నార దుండును క్షణములో వచ్చెదము.

వసం : అట్లే యొనర్చెద, (వసంతకుడు నిష్క్రమింప, నారదుఁడు ప్రవేశించి)

నార : దేవదేవా! పురాణపురుషా!

శా. విన్నం జాలదె మీ కథావళుల, మీ వేదాంత సద్గోష్ఠియం
దున్నంజాలదె మీ భవాపహర సారోపాస్య రూపంబుఁ గ
న్గొన్నంజాలదె మీ జగన్నుత మహోగ్రాంఘ్రనామంబుఁ జే
ర్కొన్నంజాలదె ముక్తిగోరు నతఁడో గోపాలచూడామణీ!

కృ : నారదా! నీభక్తి కెంతయు సంతసించితిని. నీ మనోభీప్సితంబు గనుగొంటి. అది నేడే యీడేరును. సత్యాప్రేమను . భక్తిగా మార్పనెంచి నేనే దీనినంతయు బన్ని నిన్నుఁ గారణ మాత్రుఁగా నొనర్చితి. శచీదేవి కసంతుష్టిఁ గల్పించినది నేన. నీకు

బహ్వృత్తాంతబుద్ధిని పరోపకారచింతను జేకూర్చినది నేను. రుక్మిణికి బుట్టిన దిన దినము కృష్ణధ్యానింపఁ బ్రేరేపించినది నేను. సత్య బుద్ధ్యాక్రమణా చరణాసక్తిని గూర్చినది నేను. నేఁడు సత్య యవిద్యా ధ్వంసన మొనర్చి భక్తురాలిఁ జేయునది నేను. ఇదంతయు నందుల కావశ్యకమయ్యె. ఎంతయుఁ బ్రేమప్రాపణీయమైనను నయ్యాది స్వార్థలాభకాంక్షి, దేహాభిమాని, ఐహికసుఖార్థి. దీనికంటె నన్ని విధంబులఁ గామ్యమైనది భక్తి. భక్తియుక్తులు నాలో లీనమై పోవు దురు. నాసుఖమే వారి సుఖము, నాధ్యానమే వారికి ధర్మార్థకామ మోక్షప్రదాయి. విటపంబుపై వ్యాపించు తీగలవలెఁ బ్రేమయుక్తులు వేఱుగానుండ, సంయుక్తాంగియై విటపంబట్లు భక్తియుక్తులు నాతో సాయుజ్యమును బొందుదు. ఇట్టుఁ బ్రేమయుక్తులఁ జేయు స్పర్శవేది దుఃఖ మొకటియే. పిల్లల కేడ్పించినఁగాని ముద్దురాని విధమున నాకు బ్రాణులఁ గష్టపరంపరాపాలు జేసి పరీక్షించిన దనుక మోక్షమొసఁగు బుద్ధి జనింపదు. అజ్ఞులు మర్త్యులొకింత కష్టములు వచ్చినఁ గన్నీరు విడచుచుఁ గాలముఁ బుత్తురు. విజ్ఞులు కష్టాంబోరాశి నిమగ్నులై పాపపంకిల చిత్తమ్ముల సంక్షాళనం బొనర్చి కైవల్యంబుఁ గాంతురు.

సీ. నాఁగేటిపోటుల నలిగి వసుంధర
బహుళసస్యాఢ్యయై వఱలునట్లు
దహనకీలల నెత్తు దగ్గియు బంగార
మెక్కుడువన్నె వహించునట్లు
సానరాపిడిచేత సగమయి వజ్రంబు
వరణీయ కాంతులఁ బఱగునట్లు
తాఁకుదెబ్బలచేత వ్రస్సి గంధద్రవ్య
మెక్కుడువాసన లీనునట్లు

తే. గీ. కష్టనిచయంబుచేఁ బ్రాణిగణము లెల్ల
నైజదుష్కృతపథగమనంబు వదలి

తత్త్వము నెఱింగి భక్తిమహత్త్వ మెఱిగి
పరమధామంబుఁ గాంతురు బ్రహ్మతనయ

నార : దేవా! ఏతద్వ్రతమాహాత్మ్య శ్రవణంబున నెంతయు ధన్యుండ నైతి.

కృ : నారదా ! ఎల్లరు దీని గ్రహించి ముక్తిగాంతురుగాక ! ఇంక దానమంటపమున కేగుదము రమ్ము. (నిష్క్రమింతురు)

క్రొ త్త నా ట క ము

## భో జ కా ళి దా స నా ట క ము

గ్రంధకర్త: సోమరాజు రామానుజరావుగారు.

ఇందు కాళిదాసు వివాహమప్పుడుచేసిన యల్లరితో, 'నవ్వము' అని వ్రతముపట్టినను నవ్వురాకమానదు. కాళిదాసు గర్భాదానము గదిలోచేసిన వెఱ్ఱివెఱ్ఱి చేష్టలు, కాళికాదేవి ప్రత్యక్షము, భోజరాజు రాజ్యప్రాప్తి, భోజునిదగ్గర కాళిదాసు పండితుడుగా జేరుట, పండితులు ఓర్వలేమిచే కాళిదాసునిపై భోజరాజుతో కొండెములు జెప్పుట, భోజరాజు సభలో అనేక సమస్యలు కాళిదాసు పూర్తిచేయుట, భోజరాజు భార్య లీలావతికి కాళిదాసునకు సంబంధమున్నదని భోజరాజనుమానపడుట కాళిదాసును దూషించుట, కాళిదాసు ప్రస్థానము, కాళిదాసు కొఱకై భోజరాజు చింతించుట, కాళిదాసు చరమశ్లోకము జెప్పుట. కాళిదాసు నిర్యాణము కాళిదాసుభార్య–శారద పునర్జీవితుని జేయుట మొదలగు నెన్నో యంశములతో చక్కని ప్లాటుతో నలరారుచున్న నాటకరాజము. వెల రు 1–8–0

వలయువారు ఇట్లు వ్రాయవలెను.

కురుకూరు స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు,
సరస్వతీ బుక్ డిపో, వి జ య వా డ.

## ద్వితీయ రంగము

### స్థలము : దానమంటపము

(శ్రీకృష్ణుడు సత్యభామయు సుస్నాతులయి పట్టువస్త్రంబులఁ దాల్చి సర్వాలంకృతులై సుమదామముల ధరించి యుందురు. సత్యభామచే గర్గుండు వ్రతము జేయించుచుండును. నారదుఁడు ప్రక్కన నాసీనుండయి యుండును. వసంతకుఁడు నలినీ బ్రాహ్మణులు ముత్తైదువలు చుట్టుప్రక్కల నాసీనులయి యుందురు. ఒక తుల కట్టబడి యుండును.)

గర్గ : సాత్రాజితీ ! వ్రతము ముగిసినది. ఇఁక దానంబులు నిల్చి యున్నవి. మున్మున్న భర్తృదానమున్నది. దాని కుపక్రమింతునా?

సత్య : ఆర్యా ! అట్లే కానిండు

గర్గ : సభాసదులారా! ఈ నోమునోఁచు నారీమణులు తమ ప్రాణేశ్వరుల నొక విశిష్టవంశజుండును, నధ్యయన సంపన్నుండును, శాస్త్రవేత్తయు, శాంతిదాంతి సమన్వితుండును, శుభాకారుండును శిష్టాచార విభూషనుండును నగు తాపసపుంగవునకు దాన మొసంగవలయు, తర్వాత నా పతిగృహీతకు శక్తి ప్రకారంబు భర్తను దులందూఁచగల ధనము నేని ధనేతరము నేని యొసంగి మరల భర్తను గ్రహింపనగు. ఆ దాన మిప్పుడొనర్ప వలసియున్నది. ఆ దానపరిగ్రహణంబునకు మీలో నెవ్వరేని పాత్రులున్నఁ దెలుపఁగోరెద,

వసం : (ఒక బ్రాహ్మణుని దండజేరి) అప్పయ్యదీక్షితులూ ! మీ పేరు జెప్పి మీ కా దాన మిప్పింతునా ? మీ శుభాకారము నిర్వర్ణనీయము గదా?

అప్ప : వసంతకా! నలుగురిలో నా పరువు దీసితివా, యొక చెంపకాయతీసెద భద్రము,

వసం : (వడుగత్తి వేరొక బ్రాహ్మణుని సరసకేఁగి) చయనులుగారూ! మీ కిప్పింతునా?

చయ : వసంతకా! నీ కోఁతియాటలమానుము. నా దక్షిణలో నీకు సగత్తును లెమ్ము.

సోమయాజు : ఆర్యవర్యా! ఈ విషయమున సందియ మందనేల? మీరు నుడివిన సర్వలక్షణంబులకును లక్ష్యంబైన నారదమునీంద్రునికంటె నట్టి యుత్తమదాన పరిగ్రహణంబునకుఁ బాత్రు నెవ్వరుందురు? కావున నా దేవర్షి చంద్రుఁడే యీ దానంబు గొన నర్హుండు.

గర్గ : సభాసదులారా! ఇంక నేమేని భిన్నాభిప్రాయంబులు గలవా? (కొంతకాల మూరకుండి) ఇంక మీ మౌనము నే పూర్ణాంగీకారసూచకముగాఁ గైకొని నారదునకు శ్రీకృష్ణుని దాన మిప్పించెద.

నార : ఆర్యులారా! ఈ యుత్తమదానము నాకీయ మీరంగీకరించినందుల కెంతయు మీకుఁ గృతజ్ఞుండను. ఈదాన పరిగ్రహణంబున నే నెంతయు ధన్యుండనగుదును. దానానంతరము శ్రీకృష్ణు దుల దూచు సంభార మిచ్చిన మఱల సత్యాదేవి కతని నొసంగెద.

గర్గ : దేవీ! ఈ పుష్పహారంబు శ్రీకృష్ణు చేలాంచలములకుఁ గట్టి యా పారిజాతవృక్షంబునకుఁ గట్టుము ఆ వృక్షంబునుగూడ దాన మొనర్ప నెంచితివిగదా?

(సత్యభామ పుష్పహారముఁ గయికొని కృష్ణునిదగ్గరకు వ్రీడాకుల చిత్తయై రాఁ గృష్ణుఁడు నవ్వుచు లేచి తన చేలాంచలమును సత్య చేతి కందిచ్చి)

కృ :

మ. నబలా! సిగ్గిలనేల? యీ వ్రతవిధానంబీ దృశ్యంబౌట, లో
న విచారింపక నన్నొసంగి మఱలన్ వైళంబుగా నీముని

ప్రవరుం డాడినయట్లు నాబరువు ద్రవ్యబిచ్చి గైకొండు, బాం
ధవవర్గంబుల వన్నెవాసిఁగను మా తారార్క-చంద్రంబుగాన్.
(సత్యభామ పూలహారముతో శ్రీకృష్ణుని బారిజాతవిట
పంబునకుఁ గట్టును)

నార : (లేచి) (స్వగ) ఆహా! ఏమీ దేవదేవుని విచిత్ర వర్తనము! నాఁడు బలిని గట్టినవాఁడు జితేంద్రియులఁ దపోధనుల మాన సాలానబంధనమున నేసిఁ గట్టబడనివాఁడు నేఁడొక యబలచే బారిజాతవృక్షంబున కొక పూలదండచే గట్టంబడియె. ఈ మహామహుని చర్యలు దురూహ్యంబులు గదా!

గర్గ : దేవీ! ఇంక నారమునకు నీ ప్రాణేశు ధారవోయుము. నారద మునీంద్రా! ఇటు రమ్ము. (నారదుఁడు రాఁ బాదములఁ గడి గించి సత్యచేతులలో నిరుకోసి శ్రీకృష్ణుని చేతులగుండ నార దుని చేతులలో "తుభ్యమహం సంప్రదదే నమో నమః" అని చెప్పించి విడిపింపఁజేయును) మునీంద్రా! ఇఁక బారి జాతంబును శ్రీకృష్ణుఁడును నీవి.

నార : ఆహా! ఎంత కృతార్థుడనైతి!

ఉ. ఏమి తపం బొనర్చి జనియించినవాఁడనొ, నేఁడు సత్యభా
మామహిళావ్రతంబున సముంచితరీతిఁ బ్రతి గ్రహించితిఁ
గామితసిద్ధిదాయకుని ఖండిత ముష్టనిశాటు సర్వమ
ర్త్యామరపూజితాంఘ్రి, నఖిలాఘవిదూరు, ననంతు నచ్యుతున్.

గర్గ : దేవీ! ఇఁక బ్రాహ్మణులకు దక్షిణతాంబూలము లొసంగ వచ్చునా?

సత్య : ఆర్యా! ముందు తులాభారము జరుపగూడదా?

గర్గ : దానిని పినిపిదప జరిపెదను. నలినీవసంతులారా! ముత్తైదువు లకు బ్రాహ్మణులకు దక్షిణతాంబూలము లొసఁగుఁడు. (నార దుఁడు శ్రీకృష్ణుని సుమదామమునఁ బట్టుకొని యెడముగా నిలువ. నలినీవసంతకులు దక్షిణతాంబూలము లొసంగుదురు.

బ్రాహ్మణులు దక్షిణంగొని తమతృప్తిని వెల్లడిఁ జేయుదురు. బ్రాహ్మణులందరు లేచి నిలుచుందురు. సత్య కృష్ణునివంక జూచుచుండును.

నార : భూసురులారా! ఉండుడు. తులాభారముఁ దిలకించి పొండు. దేవీ! ఇఁక దులాభారమున కుపక్రమింతుమా?

సత్య : సత్వర మట్లొనర్పుము.

గర్గ : మునీంద్రా! శ్రీకృష్ణునిం దోడి తెమ్ము.

నార : అట్లే దేవా! రమ్ము. (కృష్ణునిం బూలదండలతోఁ బట్టి తెచ్చి తులలో గూర్చుండఁబెట్టి) దేవీ! ఇఁక నీ విభుని దూఁపఁగల పదార్థముల( దెప్పింపుము.

సత్య : నలినీ! నావి యొక వారపు సొమ్ములఁ దెచ్చియుంటివే. వానిని త్రాసునం దుంచుము. వసంతకా! నీవు నలినకి సాయ మొనర్పుము. (నలినీ వసంతకులు సొమ్ములఁ ద్రాసునపైవఁ ద్రాసు కదలకున్న) త్రాసు కదలనేలేదా? ఏమిది? నా మిగిలినయాఱు వారపు నగలను దెచ్చివేయుడు. (అట్లొనర్చినను ద్రాసు కదలకున్న) ఏమిది? త్రాసు మోయరాని బరువిడినను జింతాకంత యేని కదలకున్నది. (త్రాసుజూచి) వసంతకా! నీ కీ త్రాసునం దేమైన లోప మగపడుచున్నదా? చూచి చెప్పుము.

వసం : (ఇటునటు త్రాసును పరికించి) ఇందేమియు దోసము నాకుఁ గనఁబడుటలేదుగాని యేదో మోసముమాత్ర మున్నది. లేనిచో నింతబరువు మానవమాత్రుఁ డుండునా? ఇంకను బ్రయత్నింపు.

సత్య : అట్లు తప్పక యొనర్చెద. నలినీ! నీవు మఱలనేఁగి శమంతక మణి యొసంగిన బంగారము నంతయుఁ దెప్పించి వేయించుము. దానితోఁ ద్రాసు తప్పక కదలవలయు [అట్లొనర్చినను ఫలము లేకున్న] అక్కటా! ఇదేమిమాయ? మునీంద్రా! నా మనో విభుండు నిక్కముగా నింత బరువున్నాడా!

నార : దేవీ! నాకుమాత్ర మేమి తెలియును? ఆతఁ డెంతబరువో యతనికే తెలియవలయు.

సత్య : నలినీ! నా ప్రాణేశుండు పరరాజులఁ గొట్టితెచ్చి నాకిచ్చిన ధనమంతయు దెచ్చి త్రాసున వేయుము. ఇదేమో చిత్రముగా నున్నది. (అట్లొనర్చినను త్రాసుకదలకుండుటం గాంచి) అక్కటా! నాయింటనుండు ధనమునంతయు త్రాసునవైచితిని కాని తుల యించుకయేని కదలలేదు. ఇంక నేమి సేయుదు? ఇట్టి విపరీత మెందైనఁ గలదా?

క. చిరకాల పరిచయంబున
బరు వొక్కింతయును లేఁడు ప్రాణేశ్వరుఁ డం
చఱమఱ విడి దానం బిడఁ
గరముం బరువయ్యె నింకఁ గార్యం బెద్దియో?

కృ : సత్యా! ఏమూరకున్నావు? నీ యింటనుండు ధన మంతయు నిక్కువముగా నింతమాత్రమే యగునా?

సత్య : నాథా! నిక్కువముగా నా యింటనుండు ధనమంతయు నిదే. ఇఁక జిల్లిగవ్వయేనియు లేదు.

కృ : సత్యా! అట్లయిన నేనీ నారదునకు బానిస గావలసినదేనా? ఎంతపని చేసితివి?

ఉ. నాకడ మీ యనుగ్రహమునన్ ధనరాసులు త్రవ్వి తండమై
చేకురియుండ మీ బరువు చేకురఁ జేయుటదెంత యంచు నే
వాకముమీఱ నీవనిన పాటిగ నియ్యెడ జేయుచుండ, నా
కా కులపాటుఁగూర్చ నగునా? తగునా మగనాలి గతుల్?

సత్య : ప్రాణప్రియా! మిమ్మొక జడదారినుండి ప్రతిగ్రహించు ప్రయత్నము నెన్నఁటికేని విరమింతునా? కొంచె మోపిక చిక్కఁ బట్టుఁడు [నారదునివైపుతిరిగి] మునీంద్రా! ధనముచే నలవిగాని యెడ, ధనేతరముచే నాహృదయేశుఁడూచికై కొనవచ్చుఁగాదా

నార : దేవీ! సాధ్యమయిన నట్లే యొనర్పవచ్చును.

సత్య : నలినీ! మనసుందిరమునఁగల ప్రతిపదార్థమును దెచ్చి తులయం దుంచుము. [అట్లొనర్చినను ప్రయోజనము లేకున్న] మునీంద్రా! ఇందేదో తంత్రమున్నది. లేకున్న నానాథుఁడేమి? ఇంత విపరీతపు బరువుండుటేమి?

నార : దేవీ! ఇంత బరువా? ఆ భార మెవరి కెఱుక!

తే. గీ. అండపిండ వేదోండ సంహతుల నెల్ల
గుప్తగతి బొజ్జలోఁ నుంచుకొన్నయట్టి
తోయజాక్షునితోఁ దులఁదూపఁగలవె
ధనముల ధనేతరమ్ములఁ దరళనయన!

సత్య : మునీంద్రా! నన్నప్పుడు వ్రతమొనర్పఁ బురికొల్పి యిప్పుడీ మాటాడఁ బాడియా! అప్పుడే యితఁ డింత బరువుండునని చెప్పరాదా?

నార : దేవీ! నే జెప్పితినిగాని నీవు దానిఁ దెలిసికొనవైతివి. ఈ శ్రీ కృష్ణుండు మేటిమగండని యెంచితివిగాని ప్రకృతిస్వరూపుం డని యెఱుంగవయితివి. దానికి నే నేమందును?

సత్య : నా మనోహరుఁ దులదూపలేని సంభారము లేనిచో నీ యభీష్టమగు వస్తువును గయికొని నానాథుని నాకిచ్చిపొమ్ము. అతఁడు నీకేల? ఇదిగో నీ శమంతకమణినిఁ గొమ్ము.

నార : దేవీ! నాకు శ్రీకృష్ణుఁ దులదూఁచినదియే వలయు. ఇతరములు నా కుపేక్ష్యంబులు. నీవట్లు విలువలేకున్న నీతని విపణివీధికిం గొంపోయి యెవరికైన నమ్మెద. నాబోటి భిక్షాటునకు, దేశాటునకు నీ మహామహు భరింప శక్యమా?

సత్య : ఏమేమి? నాభర్త నంగడిఁబెట్టి యమ్మెదవా? అక్కటా! నారదా! ఇదేమి పెద్దతనము? నీవు మామక శ్రేయస్కామివనుకొంటినిగాని మత్సపత్నీహితైషివని తలఁపనైతి, మేకవన్నె పులివని యెఱుంగనయితిని. నిన్ను నమ్మి మోసపోయితిని.

చ. పతినొక పూజనీయగుణవార్థికి దాన మొసంగి పుణ్యక
 వ్రత మొనరింతువేని ఫలవంతమగుఁ భవదీయవాంఛితం
 బళివరొ! యంచు ము న్నలికి యజ్ఞానరించిన యంత నన్ను నీ
 వితమున ధాతృపుత్ర ! విలసింపఁగఁ జేసెద వెట్టిన్యాయమో !

నార : కృష్ణా! ఈ మాటలతో నేమిలాభము ? లెమ్ము. అంగడివీధి కేగుదము (కృష్ణుడు లేవఁబోవుచో)

సత్య : ఉండుడు. (మంగళసూత్రముఁదక్క మిగిలిన నగలన్నిటిఁ దీసి తులయందు వయిచినను లాభములేకున్న) నలినీవసంతకు లారా ! బ్రాహ్మణులారా ! ఊరక చూచుచుండెదరేమి ? మీ మీ నకల నాణేములఁ బ్రాసున వేయుడు. అట్లయినను నా నాధుడు నాకు దిక్కగునేమో. [నలిని నగలను వసంత కాదులు పై వస్త్రములను దక్షిణతాంబూలములను వైవఁ బ్రాసు కదలకున్న] నాథా! [శ్రీకృష్ణునకు మోఁకరించి] నన్ను మీరే రక్షింపవలయును. తప్పు మన్నింపవలయు.

కృ : సత్యా ! మనఃపూర్వకముగా నన్ను దాన మొనర్చి యిప్పు డిట్లాడిన నేమి ప్రయోజనము ?

చ. అతివరొ! నన్నుఁ దూచెడు ధనాదులు నీకడలేకయున్న దు
 ర్గతులకు లోనుగా నగుదుగావున యోజనఁచేసి చేయు మీ
 వ్రత మన నాలకింపక ప్రవర్తిలి యీ గతి నాడె దక్కటా!
 గతజల సేతుబగధములు గావొక కాముకకోటి యోజనల్ ?

సత్య : ప్రాణప్రియా? నా యజ్ఞానంబును క్షమించి నాకు మి మ్మి జడదారినుండి కొనుమార్గ ముపదేశింపుఁడు.

నార : కృష్ణా ! నాయాన లేనిదే నీ వెవ్వరితో మాటాడ గూడదు సుమా! లెమ్ము [కృష్ణుడు లేవ]

సత్య : నారదా! ఇదేమి యన్యాయము? నా నాధునితోడ మాటాడ నీయవా ?

మ. అకలంకాత్ముఁడ వంచు నీ పనుపుఁ జేయబూనితిఁగాని నీ
వకటా! యితంటి మోసగాడవని స్వప్నావస్థయందేని మా
మక చిత్తంబున నెంచియున్న యెడ నీ మార్గంబునన్ బ్రాణనా
యకు నీ బోట్లకు దానము న్సలిపి సౌఖ్యంబెల్లఁ గోల్పోదునే?

నార : కృష్ణా! సత్యదేవి నిన్ను మాకు దానమొనర్చినది సత్యంబ యేని మా భృత్యుఁడవయి మా యభీష్ట కృత్యంబు లొనర్ప వలయు.

కృ : నారదా! అందులకు సంసిద్ధుఁడనై యున్నాఁడ.

నార : అట్లయిన నిటు రమ్మా [శ్రీకృష్ణుడు రా] అటు పొమ్మా [పోవ] ఇటు రమ్మా [రా] కూర్చుండుము.[కూర్చుండ] లెమ్మా [లేవ] ఇదిగో నీమహతి గయికొమ్మా. ఇదిగో కమండలువు. ఇందు మిన్నేటి జలమున్నది సుమీ! ఇదిగో నాకీశ్వరుం డిచ్చిన శార్దూలచర్మము, ఇదిగో యక్షమాల రా రమ్మా. [కృష్ణుడు వాని నందికొని వెంట రా]

క. సేవలఁ గొంటయె కాని
సేవించు టెఱుంగనట్టి శ్రీనాథుఁడె నా
సేవకుఁ డయ్యెను, హరి భ
క్తావళికి విధేయుఁడంట యనృత మ్మగునే ?

కృష్ణారమ్మా అంగడి వీధి కేగుదము.

[నారద కృష్ణులు నిష్క్రమింప

సత్య : నారదా! నారదా! ఇట్టి యన్యాయము నీకుఁతగునా నిల్వుము నిల్వుము.

[సత్య నిష్క్రమించును. నలిని వసంతకుఁడు బ్రాహ్మణులు వెంబడింతురు.

## : తృతీయ రంగము :—

స్థలము—ద్వారకాపురి విపణిశ్రేణి.

[కృష్ణునిమెడలోఁ బూలదండఁ బట్టుకొని నారదుడు ముందు నడచు చుండును, బ్రాహ్మణాదులు వెంబడింతురు]

నార : పౌరులారా! రండు, రండు. శ్రీకృష్ణునెత్తుధనమిచ్చి కొనుడు. ఇతడు భక్తులకు సులభ సాధ్యుడు. వెనుదీయకుడు.

సీ. నీలాంబు వాహసన్నిభ శరీరుండయ్యు
దీర్ఘాఘ తిమిరప్రదీపుఁ డితఁడు
సత్యాకటాక్ష వీక్షణ బంధితుడయ్యుఁ
ధీరాతిధీరదుర్వారుఁ డితఁడు
ఆభీరికామానహరణలో లుండయ్యు
సర్వ సంపూర్ణ చరితుఁడితఁడు
మర్త్యజన ప్రతిమాన విగ్రహుఁ డయ్యు
దేవావనీ దేవ దేవుఁ డిత డు

తే. గీ. ధారుణీరాజ్యభారవిదూరుఁ డయ్యు
రాజరాజ ప్రపంచ సామ్రాజ్య డితఁడు
కనుక వైళంబ శ్రీకృష్ణుఁ గొనఁగ మీరు
రండు రం డిట్టితఱి వేఱు రాదు రాదు.

ఏమి! మీ రెవ్వరును గొనలేరా? కృష్ణా! అదిగో సత్యభామ యిటు వచ్చుచున్నది. రమ్మింక నొకవీధి కేగుదము.

[నిష్క్రమింప సత్యభామ నలినీ సమేతయై దుఃఖాక్రాంతయై గాన మొనర్చుచు బ్రవేశించును]

సత్య : అక్కటా! నా నాథుని నారదుఁ డింకొక వీధికిం గొంపోయె. ఏమిసేయుదును? ఎంతకాలమిట్లు వెన్నాడుదు? ఏలాటి

దుర్మోహావార్తమున నాయూరివేరంపుఁ దపసిబోధనకుఁ జెవి యొగ్గితినో గదా!

నళి : దేవీ! ఇంతయు నా కలహాశనుని కుతంత్రమే యగు.

సత్య : నెచ్చెలీ! అవును. కాని యీ యెడ దప్పించుకొను మార్గ మెయ్యదియో దెలియకున్నది. కాలము జరుగుకొలది నా బంధువర్గ మీవార్తవిని నన్ను నిందింపవచ్చు నని భయ మెత్తు చున్నది. అక్కటా! వారి కేమిప్రత్యుత్తర మిత్తు.

సీ. దేవకీ వసుదేవులేవచ్చి మా పుత్రు
నేమిచేసితివన్న నే మనుదును ?
బలరామ సాత్యకుల్వచ్చి మా సోదరు
నెందుఁదోలితి వన్న నేమనుదును ?
జాంబవత్యాదులు చనుదెంచి మా భర్త
నేటి కిచ్చితి వన్న నేమనుదును ?
మదన సాంబాదులు నెదురేఁగి మాతండ్రి
నెచటి కంపితివన్న నే మనుదును ?

ఆ. వె. యాదవు లరుదెంచి మా దేవ దేవుని
నెట్లొసగితి వన్న నే మనుదును !
నేమి పల్కుదాన నేమి సల్పెడుదాన
నెట్లు మనెడుదాన నింకపైన

నళి : దేవీ! సమాశ్వసిల్లుము నీ ప్రాణేశ్వరుఁ గలిసికొందము. రమ్ము తర్వాత నంతయుఁ జక్కపడును.

సత్య : అట్లేయగుగాక! రమ్ము (శ్రీకృష్ణు వెన్నాడుదము.)

(నిష్క్రమింప)

నార : (మరల కృష్ణునితో డ్తెచ్చి) పౌరులారా! రండు, రండు. ఈతని మహాత్మ్యమును వినుఁడు

సీ. ఇతని పాదమే సుఁడీ పతితజనావన
సారభాగీరథీజన్మభూమి

ఇతని వక్షమె సుఁడీ యిందిరా సుందరీ
మానిత కేళికా మందిరంబు
ఇతని చక్రమెసుఁడీ పృథుల దోర్వీర్య గ
ర్వాంధ దైత్యానేక పాంసుశంబు
ఇతని హస్తమె సుఁడీ ఋజుమార్గ సంచార
సంరక్షణాసక్త సాధనంబు

తే. గీ. ఇతని దర్శనమే సుఁడి శ్రితవితాన
జపతపోవ్రతపాదన సత్ఫలంబు
కాన నీతని గొన వనుమాన మేది?
ధనములను దెచ్చి తులఁదూచి కొనుఁడు కొనుఁడు.

కృష్ణా! ఇందెవ్వరును గొనువారు లేరు. మఱియు సత్యాదేవి కూడ నిటు వచ్చుచున్నది. ర మ్మింకొకవీధి కేఁగుదము.

[నిష్క్రమింప సత్యభామ దుఃఖార్తయై ప్రవేశించి]

సత్య : అక్కటా! మఱల నా మనోహరు నాకంటికి కగపడకుండఁ జేఁసె. అక్కటా! కుడిచి కూర్చుండక యీ వ్రతమున కేల పూనితిని? ఎట్లు ప్రాణేశుఁ బాసి జీవింతు! ఎట్లితని నారదు బారినుండి రక్షింతు? ఎట్లు మఱల గలిసికొందు?

[జాంబవతీ మిత్రవిందలకు మార్గముఁ జూపించుచు వసంతకుఁడు సత్య కెదురుగా వచ్చును.]

వసం : దేవేరులారా! అదుగో సత్యభామ మీా మగని దానమొనర్చి పొగలు చున్నది.

సత్య : అక్కటా! అదుగో నా సపత్నులు వచ్చుచున్నారు. వార లేమందురో? వారి కేమిప్రత్యుత్తరమిత్తు? అయ్యో! ఎంత దెలివిమాలినకార్య మొనర్చితిని!

జాంబ : [సత్యను డాసి] సత్యభామాదేవీ! ఈ వసంతకుని మాట నిజమేగదా! చేతులార ప్రాణేశ్వరు నొరున కెట్లు [illegible] మొనర్చితివమ్మా?

మ. పొలతుల్ పూర్వము ప్రాణనాథుప్రణయంబుం గోరరో? కోరి నో
ములనోమ్మరో? నోమి దానములచే భూదేవులందన్పరో?
జలజాతేక్షణ! వార లేరయిన నీ చందానఁ బ్రాణేశు న
న్యులకున్ దాన మొసంగినారటె? వ్రతోద్యోగానురాగాత్మలై.

ఏమయిన నాతని దానమొనర్ప నేల?

ఉ. ఆకలహాశనుండు వనజాసన! నీకుఁ బ్రతీక్ష్యుఁ డైనచో
నీకయి కృష్ణుడిచ్చిన మణీకనకాంబర వస్తువాహనా
నీకము భక్తిమై నిడి గణించిన గొప్పగుగాని నీకునున్?
మాకును బ్రాణనాథుఁడగు మాధవునిచ్చు టదెట్టి న్యాయమే?

జాంబ : బెల్లముగొట్టిన రాయివలె నూరకుండెదవేమి? నీ వెవ్వతెవని శ్రీకృష్ణు నారదునకు దానమొసఁగితివి? నీ కట్లొనర్ప నధికార మెవ్వరిచ్చిరి?

సీ. కనిపెంచి పెద్దఁజేసిన తల్లిదండ్రులు
దేవకియును వసుదేవుఁ డుండ
లనయంబు వెన్నంటుకొని కొల్చు సోదరుల్
హలధారణుండు సాత్యకియు నుండఁ
బతియె దైవంబని సతతంబుఁ బూజించు
పట్టమహిషి భీష్మపట్టియుండ
నినుఁబోలె వాసుదేవుని చెట్టఁబట్టిన
సరసిజనేత్రు లెందఱొ యుండ

ఆ. వె. జనకులాలనమున ననుదిన వృద్ధిని
గనెడు మన్మథాది తనయులుండ
కృష్ణుపట్ల నీకు నెటువంటి యధికార
మున్నదంచు దాన మొసంగినావె.

మిత్ర : స్వార్థలాభంబు వాంఛించి నీతోడ మమ్మందర నన్యాయ మొనరించితివి.

వసం : ఈ తప్పునకు నిన్నేమి యొనర్చినను దోషములేదు. నా ప్రాణ మిత్రునకు నాకు నెడఁబాటు గల్పించితివి.

సత్య : సపత్నులారా! మీచేత నే నిన్నిమాటల బడవలసియుండ నా వ్రాఁత నెవ్వరు తప్పింపగలరు? ప్రేమాంధనై యీ కపట మునీంద్రు మోస మెఱుఁగలేక యతఁ డుపదేశించిన వ్రత మొనర్చి నా ప్రాణంబునకుఁ బ్రాణమగు నందకుమారుఁ గోల్పోతి. మొదలున కే మోసము దెచ్చుకొంటి నా యజ్ఞానముం గనుఁగొంటి. ఇంక—

ఉ. ఏనది యైన దేమొ యిటు లాఱడి సేయుట లుజ్జగించి, యిం
కైనను బ్రాణనాయకుని హాటకగర్భతనూజునుండి చం
ద్రాననలార! యేగతిఁ బ్రియం బిడి కైకొన సాధ్యమౌనో మీ
రానతి యిచ్చి నాకతి దయాపరతం బతిభిక్ష బెట్టుఁడీ 15

జాంబ : అట్లే యొనర్చెదము. రమ్ము. ఆ నారదుఁ గలిసికొందము

(నిష్క్రమింతురు.)

(నారదుడు శ్రీకృష్ణునితో బ్రవేశింప యాదవులు చూడవత్తురు.)

నార : యాదవులారా! రండు కొనుడు. మీ యదుకులసార్వభౌముని

సీ. కొలిచెడువారికి గొంగుబంగారంబు
పతనవిహ్వలులకుఁ బట్టుగొమ్మ
చేమోడ్చువారికిఁ జేతి చింతామణి
అలసినవారికి నిలువనీడ
మ్రొక్కెడువారికి ముంగిటపెన్నిధి
పిలిచెడువారికిఁ బెరటిసురభి
తపియించువారికి ద్రావంగ నమృతంబు
అర్థించువారికి నమరతరువు

ఆ. వె. వాసుదేవు డంచుఁ బద్మగర్భాదులు
నిత్య మితని పాద నీరజములఁ
గొల్చుచుందురుగానఁ గొనఁగ వెన్దియక
ధనముఁ దెచ్చిపోసి కొనుఁడు కొనుఁడు.

ఏమిా కొనరా? అట్లయిన నీతని నింకొక పురమునకు గొంపో యెద. అచ్చట కన్నుల కద్దుకొని కొనియెదరు. రా! కృష్ణా రమ్ము (పోఁబోవ)

యాదవులు : ఒరే! యీా జడదారి మన కృష్ణమూర్తిని మనకు లేకుండ నెక్కడికో కొనిపోవునఁట! ఊరక చూచెదరేమి? కొట్టుడు కొట్టుఁడు. (పైఁబడ)

నార : దేవా! నన్ను వీరిబారినుండి రక్షింపవలయు.

కృ : యాదవులారా! ఏమిా యీాయాగడము! నా యనుమతమ్మున నా యర్థాంగిచే నన్ను దానముగా గ్రహించిన యీా దేవర్షి చంద్రునాఁ మీారు గొట్టనెంచితిరి? ఈ దుండగమునకు నాపై ప్రేమచేతఁ బాల్పడితిరి గాన మిమ్ము క్షమించితి. పొండు.

యాద: చిత్తము దేవా! క్షమింపుము. (నిష్క్రమింతురు)

నార : దేవా! సత్యభామ వచ్చుచున్నది. ఆగర్వాంధకై నవరాత్రంబు చాలును. ఇంక విమోచన మార్గమును నుడువు మనియెదరా?

కృ : నారదా! అట్లేకానిమ్ము.

(జాంబవతి మిత్రవిందా సమేతయై సత్య పాడుచు ప్రవేశించును.)

జాంబ : నారదమునీంద్రా! ఈ యమాయకురాలి వంచించి మా నాథుని దానము పట్టితివా?

చ. చదివితి నీవు సాంగముగ శాస్త్ర సముచ్చయ మెల్ల నైన నీ
యదనునఁ దల్లిదండ్రులు నజాత్మజు నీయఁ బ్రతిగ్రహింపఁగా
నొదవునుగాని వే సతుల నొక్కతెయై చపలాత్మయైన యి
మ్మదవతి 'ఛ'"సమియ్య నిటు మాధవుఁ గైకొన నీకుఁ బాడియే?

నారః దేవీ! ధర్మము విషయము నన్నడుగకుము. శ్రీకృష్ణుఁ డంగీకరించె. సత్యాదేవి యొసంగె. నేను గ్రహించితి. ఇతర విషయముల మీ ప్రాణేశ్వరునే యడుగుము.

జాంబః (శ్రీకృష్ణునివంకఁ దిరిగి) ప్రాణేశా! మీరెట్టు లీ దానమున కీయకొంటిరి?

చ. పదఁతుల నెందఱెందరినొ ప్రాణిగ్రహించినవాఁడ వయ్యు ని
న్నొడగుఁదనాన నొక్క యలివేణి ప్రదాన మొనర్పవేడ నీ
వడువున లాతిభార్యల శుభంబు దలంపక వల్లెయంచు నీ
వొడంబక ప్రాణనాథ! తగునో తగదో యని చింత సేయవే?

సత్యః (కృష్ణుని పాదములపైఁబడి) మనోహరా! నే దెలివిలేక మిమ్ము దానమొనర్చిన మన ఋణానుబంధ మింతతోఁ దెగెనా యేమి? మాఱు పలకరాదా?

చ. కటకట! ప్రాణనాథ! యిది కర్జమె? నిర్జరమానిఁగూడి య
క్కటికము మానఁ ద్వత్ప్రియకాంక్ష వ్రతం బొనరించినట్టి న
న్నిటువలె నొంచి మానము వహించి చరించు తలంపుమాని యిం
తట నయినన్ దయామతిని దావక ముక్తిపథంబుఁ జూపుమా. 22

నాథా! నీ శరణుఁ జొచ్చితిని. నేడు నా కన్నుల పొరలూడె. నా యజ్ఞానంబు గ్రహించితిని. నాకింక మిమ్ము దాస్యవిముక్తుఁ జేయు మార్గ ముపదేశింపుఁడు.

నారః కృష్ణా! ఇంక నీవు మాటాడవచ్చును. వలసిన ప్రత్యుత్తరమిమ్ము

కృష్ణః సత్యా! నారదుడునేయడుగుము. అతఁడే నీకుఁ ద్రోవజూపును.

సత్యః మునీంద్రా! ఇకనైన నన్ను వేధించుట మాని రక్షింపుము.

జాంబః మునీంద్రా! మీరు మా ధనకనకవస్తువాహనాదులఁ దూచిఁ కైకొని నాథుని వదలుఁడు.

నారః బేలలారా! ఇంకను శ్రీకృష్ణు ధనముతో ధనేతరముతోఁ దూచికొన నెంచెదరా?

ఉ. ఈ కమలాయతేక్షణు సహీనమహాత్త్వ మెఱుంగలేక, యీ
వీఁక ధనంబుచేత మణిబృందముచేత విభూషణాళిచే
నో కమలాక్షులార! కొననూహయొనర్చెద రయ్యో! శౌరి భ
క్త్యైకవశంగతుం డనుచు నింతటనైన నిజం బెఱుంగుఁడీ. 28

భక్తిప్రభావం బెఱుంగక, భక్తజనావన బద్ధకంకణుఁడైన యీపరమాత్మయే కృష్ణావతార మెత్తెనని రూఢిగ నమ్మక, మీరిట్లు వగబొగులుచున్నారు, ఈతఁడు భక్తులకు దక్క నితరులకు సులభసాధ్యుఁడా! వారల స్వవశులఁ జేసికొని వారికి వశుఁడై యనారతము సంచార మొనర్చుచుండు. ఇతని లోఁబరచుకొనఁ దలచువారలకు భక్తియే వశ్యౌషధము.

సీ. సర్వేశ్వరుం డగు శౌరిఁ కింకరు సేయు
ధన మున్నదే భక్తిధనము గాక ?
సర్వోపగతుఁడగు చక్రి బంధించెడు
బల మ్మున్నదే భక్తిబలము గాక ?
సర్వభోక్తను జలజాతాక్షుఁ దనియించు
ఫల మున్నదే భక్తిఫలము గాక ?
సర్వజ్ఞుఁడైన కేశవుని మెప్పించెడు
విద్య యున్నదే భక్తి విద్య గాక ?

ఆ. వె. సర్వవరదుఁడైన శార్ఙ్గిన్ సన్నిధిఁ జేర్చు
పథము గలదె భక్తిపథము గాక ?
కాన నితఁడు భక్తిగలవారకె కాని
పరుల కగ్గమగునె ? పడఁతులార !

సత్య : (స్వగ) అక్కటా! అంధురాలనై ప్రాణేశుమహాత్త్వ మెఱుంగక తప్పుత్రోవ నడుచుచుంటి నేటికి యథార్థ్యంబు గోచరమయ్యె. రుక్మిణి మార్గమే సన్మార్గమయ్యె.

నార : కాంతలారా! భక్తు లెవరైన నొక తృణము వైచినను నీ మహానుభావుని దులను దూఁప సాధ్యమగు. అట్టివారిని నెమకి ప్రార్థించి తోడి తేవలయు.

సత్య : (ఆతురతతో) మునీంద్రా! అట్టివార లెవ్వరైనఁ గలరా?

నార : లేలా? అందులకు సందియమా? భక్తులే లేకున్న నీలోకము పాడుగాదా!

సత్య : అట్టి మహాత్ము లెచ్చోట నున్నారు?

నార : ఎచ్చటనో యన నేల? ఈ పురముననే యున్నారు.

సత్య : వారెవరో తెలియఁజేయుఁడు. పాదములఁ బట్టి ప్రార్థించి తెచ్చెదను.

నార : నిక్కముగా నట్లొనర్చెదవా?

సత్య : అందులకు సందియమా? చెప్పిచూడుఁడు.

నార : నేఁ జెప్పినంత నీవు మాట తప్పక యట్లొనర్తువుగదా!

సత్య : మునీంద్రా! నామాటయం దింత యవిశ్వాసమేల? వా రెవరో తెల్పుడు.

నార : నీ...నీ...నీ...నీ... సవతి రుక్మిణీదేవియే.

సత్య : అక్కటా! ఇది నిక్కువమా? హాస్యమా?

నార : దేవీ! ఇది హాస్యమునకు సమయమా? ఆ భక్తురా లొక తృణముఁ దెచ్చివైచినను శ్రీకృష్ణుండు తులదూఁగును. నా మాట నమ్మకున్న నీభర్తనే యడుగుము.

సత్య : ప్రాణేశా! ఇది యదార్థమే యగునా? లేక యీ జగడాల చీలియును, మీరును గలిసి నన్నుఁ బరిభవింపఁ బన్నిన పన్నాగమా? (పాదములపైఁబడి)

శా. నీ మహాత్మ్య మొకింతయుంగనక యంధీభూతచేతస్కనై
సామాన్యంబలె నెంచి చేసినది దోషం బంచుఁ గన్గొంటి నేఁ
డామాలాగ్రము గర్వ మెల్ల మటుమాయంబయ్యె గోపాలకృ
ష్ణా! మన్నింపుము నీదు సత్య నింక నైనన్ సానురాగంబుగాన్.

కృ : సత్యా: లెమ్ము. నారదుఁ డాడినది వాస్తవంబ భక్తి లేక ధనమిచ్చికాని ధాన్యమిచ్చికాని వస్త్రవాహనాదు లొసఁగికాని గుడులు గోపురములు కట్టించిగాని నన్ను వశపరచుకొనుట కల లోనివార్త. భక్తితోఁ బత్రమైనను, ఫలమైనను, దోయమైనను బుష్పమైనను నెవ రొసంగుదురో వారికి నే దాసుఁడనై వర్తించెద, ఇదిగో భక్తిమహాత్మ్యము ఇంకఁ గర్తవ్య మొసర్చి ననుఁ గైకొనుము.

ఉ. నారదుఁ డాడినట్టి వతనమ్ము యదార్థముగాన, రుక్మిణీ
సారసపత్ర నేత్ర సరసం జని నీవిటఁ బుణ్యకవ్రతే
చ్ఛారతిఁ జేసినట్టి యవిచార్యపుఁ గార్యముఁదెల్పి లెమ్ము, చే
కూరును నీ యభీష్ట, మొనగూడును మోదము భక్తకోటికిన్. 26

సత్య : అక్కటా! నాథా! నాసపత్నిని నేఁబోయి వేడుకొనుమనియెదరా? ఇంత తెలివితక్కువపని సల్పి యే మొగముతో నా కాంత దండ కేగుదును? మీకేల యింత పక్షపాతము? నా గర్వాపహారణమునకై నన్నిట్లు విషమపరీక్ష చేయఁజెల్లునా?

మ. భువిపై నా చరితంబు లెల్లరకు నవ్వుంబాటుగాఁ జేసియున్
భవదీయ ప్రణయంబు నా కిటులు దుష్ప్రాపంబు గావించియున్
లవమైనన్ మదిలోనఁ దృప్తిని గనన్లేక యీ వైఖరిన్
సవతి న్వేడగ బంచెదే? మురహరీ? సాధించుటల్ చాల దే?

నార : కృష్ణా! రమ్ము. చెప్పవలసినదేమో చెప్పితిమి. నిన్ను వలచినదైన నీవు బోధించినట్లొనర్చి నిన్నుఁ బరిగ్రహించును. మనము దానమండపమున కేగుదమురమ్ము. (కృష్ణ నార-నిష్క్రమింప)

: నాథా! పోయెదరా! నేను రుక్మిణిని వేడుట తప్పదా?

జాంబ : సాత్రాజితీ! నీవొనర్చిన యవివేకపుఁ గార్యమునకుఁ దోడు కుళంకలుగూడనా రమ్ము?

మిత్ర : కాల మెవ్వఁడు నొకతేగతిగ నుండుననుకొంటివా? మొన్నఁ బారిజాతాపహరణమున నీకు విజయమయ్యె. నేఁడుపుణ్యకవ్రత విషయంబున మా నెచ్చెలికి జయముగా నున్నది. జయాప జయంబులు కావడికుండలు. ఇందులకుఁ జింతింపక రుక్మిణికడకు బోవుదము రమ్ము,

సత్య : సపత్నులారా! మీరే రుక్మిణికడఁ కేఁగి నాకు మాట ప్రార్థించి తోడితెండు.

జాంబ : మగని జేతులార దానమిచ్చినదానవు నీవుండ నాగోడవ మా కేల? మఱియు దానివలన మా కగు లాభమేమి!

ఆ. వె. నేటిదాక శౌరి నీ యింట నుండిన
నేఁడు మొదలు మానితోడ నున్న
మాకునయమె యగుట మా కేమి పట్టెను
భీష్మపుత్రిఁబోయి పిలిచిరాఁగ? 28

మిత్ర : సాత్రాజితీ! కార్యముపట్ల నిట్లు గర్వించుట తగునా? ప్రాణే శ్వరుఁడు నిన్నుగదా పోయి రుక్మిణిం బిలిచిరమ్మనియె? రమ్ము వచ్చెదవా లేక మమ్ము పొమ్మందువా?—

సత్య : అక్కటా ఎట్టి దురవస్థ వాటిల్లె ?

చ. పడఁతిరొ నా గృహంబునకు వచ్చి ననుం బరితృప్తిఁ జేయుమం
చడుగులఁబట్టి వేఁడుకొనినప్పుడు పొమ్మని తూలలాడి, యీ
యెడల విదర్భరాజసుత యింటికి సిగ్గును వీడిపోయి యే
వడిఁ బతిభిక్షఁ బెట్టుమని ప్రార్థనఁ జేసెదు దాననో కదా. 29

ఒక వేళ నేను గర్వము విసర్జించి పోయి రుక్మిణీదేవిని వేఁడు కొందునుగాక ! ఆ తన్వి నన్నుఁ జక్కఁగా సన్మానించునా లేక జరిగిన విషయములఁ దలపోసి నన్నెత్తిపొడుచునో. సతిత సర్వాతో లఘు మందురుగదా !

జాంబ : సాత్రాజితీ! రుక్మిణీదేవి శాంతమూర్తి. కృపావిస్తారవారాశి. పావన చరిత. పతివ్రతాశిరోమణి. దీనరక్షణకళాపారీణ. అట్లెన్నటికిని దూలనాడదు రమ్ము.

సత్య : అట్లేవచ్చెద. ఇంకను నాకీ గర్వమెందులకు ? రండు.

(నిష్క్రమింప యవనిక పడును.)

## —: చతుర్థరంగము :—

స్థలము : రుక్మిణీదేవి శుద్ధాంతము—తులసీవనము.

(రుక్మిణి సుస్నాతయై పట్టువస్త్రంబుదాల్చి తులసీమృత్తమునకు బూజ యొనర్చుచుండును. జాంపవతీ మిత్రవిందలు ప్రవేశించి)

జాంబ : దేవి! సాత్రాజితి నీ యింటికి వచ్చుచున్నది,

రుక్మి : నెచ్చెలి! నీవేమైనఁ బొరపడితివా యేమి? సత్యభామ యేమి. నా యింటికి వచ్చు టేమి?

మిత్ర : కార్యము కలిగినది. వచ్చుచున్నది, అదిగో.

(సత్యభామ ప్రవేశించును)

రుక్మి : (స్వగ) వీరి మాటలు నిక్కమయ్యె. (ప్రకా)

ఉ. ఏమిది సత్యభామ! యిటు లేటికి మంగళసూత్రశేషవై
మామకమందిరంబున కమందగతిం జనుదెంచినావు? ని
న్నా మధుసూదనుండు విడనాడి చరించెనొ? లేక నీ పయిం
బ్రేముడిఁ బాసెనో? తెలిపి వేగమే నామది భీతిఁ బాపుమా!

సత్య : (నమస్కరించి) అక్కా! ఏమని చెప్పుదును? నేను మీయెడ బూర్వమొనర్చిన యపచారముల నన్నింటిని మనస్ఫూర్తిగా మన్నించి నాకీ యాపత్కాలమున దోడ్పడవలయును.

రుక్మి : సత్యా! నీవు నాకేమియు నపచారము లొనర్చలేదు. కాన నేను క్షమించుట కేమియులేదు. నీకు గలిగిన విపత్తెట్టిదో తెల్పుము. సాయము నాచే నగునేని తప్పక యొనర్చెద.

సత్య : అక్కా! నేనొనర్చిన తెలివిమాలినపనిని జెప్పుటకునాకునోరాడ కున్నది. నెచ్చెలులారా! మీరు నాపైదయయుంచి తెలుపుడు.

జాంబ : సత్యా! ఇంకను గొంత యాభిజాత్యమా?

మిత్ర : సత్యా! చేసినపాపము చెప్పిన నించుక నోపునేమో నీవే చెప్పుము.

సత్య : అక్కా! నిన్న నారదమునీంద్రుఁడు నాకడ కేగుదెంచి ప్రాణే శ్వరుని పూర్ణానురాగంబు సంపాదింప నాకుఁ బుణ్యకవ్రత ముప దేశించెను. నేడు ప్రాతఃకాలమున నావ్రత మాచరించి తద్వి ధానురాగంబుగ మన ప్రాణేశ్వరు నా మునీంద్రునకు దాన మిచ్చితిని,

రుక్మి : అక్కటా! చెలా! మగువలకు మగనితోడి బ్రతుకే మంగళం బని ప్రాజ్ఞులు పల్కుచుండ భర్తృదానమిచ్చు వ్రత మొక వ్రతమా? మనపుణ్యపరిపాలకంబున లభించిన మాధవుని దాన మియ్య నీకెట్లు మనసొప్పె? అతండు మననాథుఁడు మాత్రమే గాక జగన్నాథుఁడుగదా! మరియు నతఁడు సర్వకామదుఁడే! అతని దాన మిచ్చిన చేకూరు కామ్య మెద్ది?

క. సురమర్త్యయక్షకిన్నర
గరుడ ప్రముఖులకు సర్వకామదుఁడగు శ్రీ
వరు నొరున కొసఁగి నీ వే
కరణి మదోభీష్ట మందఁ గాంక్షించితివో? 31

సత్య : అక్కా! నా వెడఁగుదనంబు నేనిప్పు డిప్పుడు గ్రహించు చున్నాను. నారదుఁడు తనకు నాథుని బరువు ద్రవ్యముఁ గాని ద్రవ్యేతరముఁగాని యిచ్చి మఱల గ్రహింపవచ్చు నన, నిశ్చింతనై నాదానంబునకుఁ గడంగితిని. అట్లొనర్పఁ దులయం దేమి వైచినను నాథుని దూఁపలేకపోయె.

రుక్మి : అయ్యో! సత్యా! మననాథుఁడు విశ్వరూపుఁడు, అతని దూఁచు పదార్థ మెందైనఁ గలదా! ఇన్నాళ్లతని నెఱిఁగియుఁ నతని మనుజమాత్రుండని యెట్లు నమ్మితివి? చూచుటకుఁ గన్ను లును, వినుటకు వీనులును, గ్రహించుటకు మనంబును లభిం చియు నయ్యవి వ్యర్థ మయ్యెనా?

సీ. పూతనాసురను విఘాతంబు గావించె
  శకటాసురుని జీవవికలుఁ జేసె
గోవర్ధనం బెత్తి గోపతి భంగించె
  ధేనుకాసురు గతప్రాణుఁ జేసె
వ్యోమకాసుర సురధామంబునకుఁ బంపెఁ
  గంసనృశంసుని గసిమసంగెఁ
గాలీయఫణిఫణాగ్రములఁ దాండవ మాడె
  శిశుపాల దుర్జనుశిరముఁ ద్రుంచె

ఆ. వె శిష్టజనులఁ బ్రోఁచె దుష్టుల ఖండించె
ధర్మమును నిలిపె నధర్మ మడఁచె
మన తపఃఫలంబు మన పెన్నిధానంబు
మనవిభుండు మనుజమాత్రుఁ డమ్మ!

మత్స్యకూర్మాద్యవతారముల నెత్తి లోకత్రాణ మొనర్చిన మహనీయచరిత్రుఁడు మన మనోనాథుఁడైన నందనందనుఁడుగాక యన్యుఁడా?

సత్య : అక్కా! ఇన్నినాళ్ళు శ్రీకృష్ణు నర్ధాంగినయ్యుఁ దీర్ఘంబుననుండు మీనంబునకుఁ దీర్ధమాహాత్మ్యముఁ దెలియనట్లు లంధశ్రవ్యక్రియ గాలముఁబుచ్చుచుంటి. ఈపుణ్యకవ్రతవ్యాజంబున యాథార్థ్యం బును గంటి, ఇప్పుడు నారదమునీంద్రుడు శ్రీకృష్ణుని దూఁచు టకు నన్నుం దోడి తెమ్మనియె నీవు మా వెంట దానమండప మున కరిగి ప్రాణేశ్వరు నారదదాస్యవిముక్తుఁ జేయుము.

జాంబ : సత్యా! మా రుక్మిణి పిన్ననాడు తల్లిదండ్రులు పెట్టిన సొమ్ము దప్ప మగని సొమ్మొక పిన్నకాసైన నెఱుఁగదుగదా! ఆ మహా మహు దేనితోఁ దూపఁగలదు?

సత్య : నెచ్చెలులారా! మీరు ప్రాణేశ్వరుని, మునీంద్రుని వాక్యము లాలించియు, నిట్లాడనగునా? ఈవైదర్భికడ భక్తిధనమేయుండ వేఱుధన మేల? శ్రీకృష్ణుడు భక్తైకవశంగతుడు గదా?

మఱియు—

మ. నను నీ నారద మౌనినుండి విలుచన్ గాంక్షించువారేని చ
యున్న వైదర్భిని దోడి తెమ్మిచటి కం చాత్మేశ్వరుండానతి
చ్చెను గానం గరుణార్ద్రచిత్తనగుచున్ శీఘ్రంబుఁ బైనమై
మన ప్రాణేశ్వరుఁ గృష్ణుఁ దూచిఁకొనరమ్మా మానినీరత్నమా!

రుక్మి : సోదరీ ! ప్రాణేశుఁ డానతిచ్చిన నే వెనుదీయుదునా ? అట్లే పోవుదము రండు.

సత్య : అక్కా! పోవుదముగాని దేనితో శ్రీకృష్ణునిఁదులనుదూచెదవు?

రుక్మి : చెలా! దేనితో నన నేల? భక్తియొండుండవలయుఁగాని దేనిచే నైన నీకార్యమును సాధింపగూడదా? ఐన హరిసమారాధ నకుఁ బ్రధానము తులసీదళమని పెద్దలందురు. దీనినొకదానిఁ గొని శ్రీకృష్ణునికడ కేగుదము.

సత్య : అక్కా ! ఈ తులసి కంత ప్రభావమున్నదా ?

రుక్మి : నెచ్చెలులారా ! తులసీమహాత్మ్యము వర్ణనాతీతమని మీ రెఱుంగరా! ఈతులసి విష్ణుప్రియ. ఈ తులసీపూజనంబు భక్తి సాధనములలో నుత్తమోత్తమంబు. కావున మనబోంట్ల కవశ్య మాచరణీయంబు.

సీ. తులసీమహీజంబు విలసిల్లు స్థలమున
సిరియును వాణియు వజ్రులుచంద్రు
తులసిచెట్టునకొక కలశంబు జలమిడఁ
బఁపఁఘములు పటాపంచ లగును
తులసీదళంబు నొదల ధరియించిన
కరతలామలకమౌఁ బరమపదము
తులసివృక్షమును బూజలచేతఁ దన్పినఁ
బుణ్యంబు లెల్లను బ్రోది గాంచు

తే. గీ. హరిసమారాధనకు వసుంధరను దులసి
కంటె మించినవస్తువొక్కటియు లేదఁ
టంచు బుధులాడుచుందు రో యతివలారా !
తులసియే తగు మాధవుఁదులనుదూద.

సత్య : అక్కా ! నీయుపదేశప్రకారమింక హరిపూజనముంబోలెం దులసీ పూజనమును నిత్య మొనర్చెద.

జాంబ : దేవీ ! మాకును సత్యదేవీవ్రత మూలంబున నజ్ఞానంబు ధ్వంసమయ్యె. మేమును నట్లే యొనర్చెదము.

మిత్ర : ఇంక! నీచరిత్ర మార్గదర్శకముగా సర్వదా మెలంగి కృతార్థ చరితల మయ్యెదము.

రుక్మి : నెచ్చెలులారా ! మీమాటలు నాకెంతయు సంతసము జేకూర్చె, ఇంకఁ దులసిదళ మొకటిఁ గోసికొని దావమంటప మున కేగుదము.

(హారతియెత్తి తులసిచెట్టు మూడుమారులు ప్రదక్షిణమొనర్చి యొక తులసీ దళమును గోసి పళ్ళెరమునదుంచి రుక్మిణి సపత్నులతోఁగలసి నిష్క్రమించును.)

## —: పంచమరంగము :—

స్థలము: దానమంటపము – తులాభారము

(శ్రీకృష్ణుండు తులలోఁ గూర్చుండియుండును. నారదుఁడు వెంబడి నిల్చియుండును. వసంతకుఁడు నళిని వేఱొకప్రక్క నిలిచియుందురు.)

నార : దేవా! మాతలిచేఁ బారిజాత విటపంబును త్రివిష్టపంబునకుఁ బంపించితి ఇంకఁ దులాభారమే మిగిలియున్నది.

కృ : వసంతకా! రుక్మిణి యింకను రాలేదా?

వసం : వయస్యా! అదిగో వచ్చుచున్నది. ఒకపళ్లెరమునఁ దులసిం దెచ్చుచున్నది.

కృ : ఓహో! నారదా! చూచితివా? తులసీదళమును దెచ్చుచున్నదఁట!

నార : దేవా! అదియేగదా గావలసిన పదార్థము. తులసికంటె మీకుఁ బ్రియమైన వస్తువున్నదా?

(రుక్మిణీదేవి తులసిదళమును పళ్లెమునందుంచుకొని సత్యా జాంబవతీ మిత్రవిందా సమేతయై ప్రవేశించును)

రుక్మి : మునీంద్రా! మా చెల్లెలు సత్య నుడివినది నిజమేనా?

నార : విదర్భ రాజపుత్రీ! అవును.

సీ. పతిపూర్ణరాగంబుఁ బడయంగ సత్య న
న్నూ్భరివ్రతం బొందు నుడువు మనియె
నే నుడివినయంతఁ దా నది గావించి
వ్రతఫలార్థము నారుఁ బతి నొసంగ
నొసగిన యంత నే మసలక నాథుని
దులఁ దూచి కొన ధనాదులను గూర్చె
గూర్చిన నయ్యని కొఱగామి మేమూ ని
న్నోడి తెమ్మని పంపఁ దోడితెచ్చె

ఆ. వె. నింకమీఁద నీవు పంకజాతాక్షి! యే
వస్తు సమితితోడ వాసుదేవుఁ
దులను దూఁచికొనఁగ దలచిన దానవో
తెలిపి యాత్మనాథు విలిచి కొనుము.

రుక్మి : అట్లే యొనర్చెద. ఇదిగో నానాథుని దూఁచు వస్తువును దెచ్చితిని చూడుడు. (కృష్ణునిచుట్టు మూడుసారులు ప్రదక్షిణ మొనర్చి మోకరించి) దేవదేవా! పురాణపురుషా! వేదాంత వేద్యా! దీనావనా! భక్తవత్సలా! నీ ప్రభావం బెఱుంగ నేరికి శక్యంబు? నీ లీలల యర్థంబు గ్రహింప నేరికి సాధ్యంబు? నీ యదార్థరూప మెవ్వరికి గోచరంబు?

ఉ. సత్త్వరజస్తమోగుణవశంబున మూర్తుల మూఁటి దాల్చి బ్ర
హ్మత్వము నంది లోకనిలయంబుల నెల్లను సృష్టిఁజేసి, వి
ష్ణుత్వము నంది లోకముల జొక్కపురీతిని నేలుకొంచు రు
ద్రత్వము నంది వానిని హతం బొనరించెద నీవె మాధవా. 36

నీవు నిర్వికారుండవు, నిరంజనుండవు, నిర్గుణుండవు. నీ మహిమ నెఱుంగ నేరక ప్రాణులవిద్యాసంజాతమైన యహంకారమమకారముల కిరవై చచ్చుచుఁ బుట్టుచుఁ, బుట్టుచుఁ జచ్చుచు నుందురు. ఒకానొకరు క్లేశానుభవంబునఁ గన్నుల పొరలూడ సత్యముం గనుంగొని నీ పాద సేవయే జన్మవిముక్తి హేతువని యెఱింగి కాలంబునంతయు నందు వినియోగించి నీకు భక్తులగుదురు. అట్టివారలకు నీవు వశుఁడవై చరించు చుందువుగదా! భక్తవత్సలా! ఇంక నే వచ్చిన కార్యమునకుఁ గడంగుటకు సెలవిండు.

కృ : రుక్మిణీ! అట్టె యొనర్చి నా భక్తులలో నగ్రగణ్యవగుము.

రుక్మి : మీ యాశీర్వాదమున్న నాకది యెంతపని? సత్యా! ఈతుచ్ఛ పదార్థముల నీ తులనుండి తీయింపుము.

సత్య : నళినీ! అట్లొనర్పుము. (నలినీ వసంతకు లట్లొనర్ప)

(రుక్మిణి తులసీదళము గన్నుల నద్దుకొని తులయం దుంచబోవుచుండ)

నారద : వైదర్భీ! కొంచెముండుము. సాత్రాజితీదేవీ! ఒకమాట జెప్పమఱచితి, శ్రీకృష్ణు నెవ్వరిప్పుడు కొనెదరో వారల కాతఁడు వశీకృతుఁడై చరించు. ఇది నీకిష్టమేగదా! ఇఁక సత్యభామావిధేయుఁడు రుక్మిణీవిధేయుఁ డగు, ఏ మనియెదవు?

సత్య : మునీంద్రా! ఇందుల కింక భయపడుదాననా?

చ. ప్రణయమె భక్తికంటె నిజవల్లభుఁ దన్పఁగ మేటిసాధనం
బని తలపోయు నేను భవదాచరణంబున భక్తియుత్తమం
బని కనుగొంటిఁ గావున భయంపడుదాన నె దీని కింక? నీ
వనరుహపత్రలోచనుఁడు భక్తవంశగతుఁడై చరించుచోన్.

నారద : బాగు బాగు. రుక్మిణీదేవీ! ఇంక మీరు గానిండు.

రుక్మి : (తులసీదళముఁ జేతఁబట్టి)

ఆ. వె. ఫలమొ ఘనరసంబొ పత్రమో పుష్పమో
కొనుచు భక్తి నిన్నుఁ గొలుచువారి
కీవు వశుఁడ వగుటయే సత్యమేని యీ
తులసిదళము నిన్నుఁ దూఁచుగాత.

(తులసీదళము వైవ శ్రీకృష్ణుడు కూర్చుండిన ప్రక్కపైకిబోవును. తులసీదళము వైచినవైపు క్రిందకుబోవును. పైనుండి పుష్పవర్షము గురియును. శ్రీకృష్ణుండు త్రాసునుండి దిగును. నారదుడు ఆ తులసీదళము నెత్తితలపై దాల్చి నృత్య మొనర్చును.)

నారద : దేవా

అందఱు : ఈదినమే సుదినము. ఈదినమే సుదినము.

నారద : దేవా! మీభక్తవాత్సల్యంబుఁ బరికించి బృందారకులు తమ యమందానందమును బుష్పవర్ష వ్యాజంబుఁ బ్రకటించు చున్నారు. మిమ్ము నమ్మినవారలకు భద్రమ్ముగలుగకుండునా?

మ. వికటాత్ముండయినన్ విటేంద్రుడయిన స్వీతవ్రతుండైన దా
నకపాదాంబుజసక్తి చిత్తుఁడయి సంప్రార్థించిన న్మించఁడే

సకలుండై సుగుణాఢ్యుఁడై సుజనుఁడై శుద్ధప్రబోధాత్ముఁడై
యకలంకుండయి, యార్తభద్రకరుఁడై యారాధ్యుడై యచ్యుతా!

సత్య : (నారదునికడ కేఁగి) మునీంద్రా! పుణ్యక వ్రతవ్యాజంబున నాకీ పురాణపురుషు నపూర్వమహిమంబు నెఱిఁగించి సన్మార్గంబుఁ జూపినందులకు నా కృతజ్ఞతావందనము లందికొనుము.

నార : దేవీ! ఇందు నా యుద్యమ మావంతయు లేదు. ఇదంతయు నీ మనోహరు విలాసమే సుమీ!

సత్య : (రుక్మిణికడ కేగి) అక్కా! నీ భక్తివిశేషంబునఁ బ్రాణేశ్వరు బంధవిముక్తుఁ జేసి నన్నుబోలు సపత్నులందఱ కృతజ్ఞతకుఁ బాత్రురాలవైతివి. నేటితో నా యజ్ఞానంబు సర్వంబు రూపుమాసె. ఇఁక నీ చరిత్ర మార్గదర్శకంబుగా గొని ప్రాణేశుని సేవించుచుండెద.

రుక్మి : సత్యా! అట్లే యొనర్చి భక్తురాండ్రఁ బేరుగాంచుము. ఇంక బ్రాణేశ్వరు దండ కేఁగుదము రమ్మ.
(శ్రీకృష్ణుని దండ కేగి నమస్కరింప నిద్దఱును లేవనెత్తి)

కృ : రుక్మిణీ! నీకెంతయుఁ గృతజ్ఞుడను. నీ భక్తిచే నన్ను నారద దాస్యవిముక్తుఁ జేసితివి.

రుక్మి : నాథా! పెన్నిధి పేదకు గృతజ్ఞత దెల్పవలయునా? మీ భక్తులకు సాధ్యముకాని కార్య మొండు గలదా?

క. అంబుధి కుల్యం బగు, సిం
హంబు కురంగం బగు; విష మమృతం బగు, శై
లం బల్పోపల మగు నో
యంబుజదళనయన తావకాశ్రితతతికిన్. 40

కృ : సత్యా! నావలన నీవు కష్టములపాలు గావలసివచ్చెఁగదా!

సత్య : నాథా! ఇట్టి ఫలమంద, నట్టికష్టముల నెన్నివర్యాయములైన ననుభవింపవచ్చు. వానిని గష్టములన నేల? అవి నిరుపమానమగు బ్రహ్మానందమునకు సోపానములు.

కృ : సత్యా! అట్లేయగుః? నీ కేమైనఁ గామ్యమున్నఁ దెల్పుము. ప్రసాదించెద.

సత్య : దేవా! ఇంకను నాకుఁ గామ్య మేమియుండును? అయిన నన్నును రుక్మిణీదేవింబోలె మీా భక్తురాలిం జేయుఁడు. అదియే నాకు గామ్యము.

శా. నీ కైంకర్య మొనర్చునట్టి కరముల్ ని న్గాంచు నేత్రంబులున్
నీ కక్రాంతము మ్రొక్కునట్టి శిరము న్నీ సేవపై బుద్ధులన్
నీ కావ్యంబుల నాలకించు చెవుల న్నిన్నెంచు జిహ్వాగ్రమున్
సాకల్యంబుగ నాకొసంగు హృదయేశా! భక్తచింతామణీ!

కృ : అట్లేయగుఁగాక! [రుక్మిణీ సత్యభామల కరములబట్టుకొని] నారదా! సురకార్యంబు నెరవేఱెనదా? ఇంకేమి వలయు?

జాంబ : దేవా! నన్నును సత్యంబోలె ననుగ్రహింపుడు.

మిత్ర : ప్రాణేశా! నన్నును నీ భక్తవర్గమునఁ జేర్చి రక్షింపుము.

వసం : కృష్ణా! నామాటగూడ మఱువక నన్ను రక్షింపుము.

కృ : అట్లె యొనర్చెద.

నార : దేవా! నీ భక్తవాత్సల్యంబు లోకవిదిత మయ్యె, ఇంద్రాణి ప్రభృతులు పారిజాత లాభంబునఁ బ్రమోదాన్వితలైరి. రుక్మిణీదేవి భక్తి తెల్లమయ్యె. సత్యమాభాదేవి ప్రేమంబు భక్తిగా బరిణమించె నా కలహాఖ్యుత్తు శాంతిఁ జెందె. నా కింకేమి కామ్య ముండును? అయిన నిట్లగుఁగాక—

—♦ భరత వాక్యము ♦—

మ. జలజా తేక్షణ పాదభక్తి పరులై సాత్రభాత్రసంపన్నులై
తులసీ పాదపూజ నక్రమదులై దోషప్రదూరాత్ములై
బలులై బల్లిదులై ప్రభాయుతులై భద్రార్థులై భవ్యులై
కలకాలంబు చరింతురుగాత! భరతక్ష్మామాతృ సంతానముల్.

# ప్రకటన

మాకు సర్వహక్కులు కలిగిన ప్రఖ్యాత రచయితలచే వ్రాయబడి పేరుగాంచిన స్టేజినాటకములు, కథలు, చరిత్రలు, నవలలు, స్క్రీనుకు ఉపయోగించే అనేక ప్రఖ్యాత గ్రంథములు కలవు. కాపీరైటు యాక్టుప్రకారము మా అనుమతి లేనిదే ఏ రచనలనైననూ, ఎవ్వరూ, ఏవిధముగా ఉపయోగించుకొన్ననూ, వారిపై నేను జరుపు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందు మూలముగా తెలియ జేయడమైనది.

శ్రీకృష్ణతులాభారం, చింతామణి, మధుసేన, రంగూన్‌రౌడి, ధరణీకోట, సతీసక్కుబాయి, ద్రౌపదీవస్త్రాపహరణం, కురుక్షేత్రం, (ద్రౌపది), విప్రనారాయణ, చండిక, ఖిల్జీరాజ్యపతనం, (ప్రతీకారం), కోకిల, పాదుకా పట్టాభిషేకం, చంద్రగుప్త ఈ నాటకములలో ఏ నాటకమయినను, నాటక భాగమైనను మా పర్మిషన్ లేకుండా ప్రదర్శించరాదు. నాటకమునకు ముందుగా పర్మిషన్ ఫీజు చెల్లించి రసీదుపొంది ప్రదర్శించవలెను. అట్లు పర్మిషన్ పొందకుండా ప్రదర్శించువారిపై మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని హెచ్చరిక.

---



---

**కురుకూరి స్వరాజ్య వెంకటసత్యనారాయణరావు**

సరస్వతీ బుక్ డిపో ప్రొప్రయిటర్.

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1**